బాలాజీగోషాయిస్వామి

# అగస్త్య వనమూలికా మర్మశాస్త్రమను సిద్ధమూలికారహస్యము

చెన్నపురి, 1926

Bālājī gōṣāyisvāmi

# Agastya vanamūlikā marmaśāstramanu siddhamūlikārahasyamu

Cennapuri, 1926

Record no. 639

## Bibliographic Record Target

బాలాజీగోసాయిస్వామి.

అగస్త్య వనమూలికా మర్మశాస్త్రమను సిద్ధమూలికారహస్యము : యంత్రమంత్రసహితము / బాలాజీగోసాయిస్వామి వారిచే దేశభాషయగు నాగరభాషయందుండిన దానిని ము. సుబ్రాయులు నాయుని వారిచే తెనుగున తర్జుమా జేయబడినది.- 3rd ed.- చెన్నపురి : కో. లక్ష్మణమొదలియారు, 1926.

104, 8 p. ; 22 cm.

Record no. 639

Bālājīgōṣāyisvāmi.

Agastya vanamūlikā marmaśāstramanu siddhamūlikārahasyamu : yantramantrasahitamu / Bālājīgōṣāyisvāmi vāricē dēśabhāṣayagu Nāgarabhāṣayanduṇḍina dānini Mu. Subrāyulu Nāyuni vāricē Tenuguna tarjumā jēyabaḍinadi.- 3rd ed.- Cennapuri : Kō. Lakṣmaṇamodaliyāru, 1926.

104, 8 p. ; 22 cm.

Record no. 639

శ్రీరామజయం.

# SIDDAMOOLIKA RAHASYAM.

అగస్త్య వనమూలికా మర్మశాస్త్రమను

# సిద్ధమూలికారహస్యము

## యంత్ర మంత్ర సహితము.

ఇయ్యది,

జగన్నాధపుర నివాసియగు

బా లా జి గో షా యి స్వా మి వా రి చే

దేవభాషయగు నాగరభాషయందుండిన దానిని

ము. సు బ్రా యు లు నా యు ని వా రి చే

తెనుగున తర్జుమా జేయబడి,

డాక్టర్ యఫ్. టి యస్. గోపాలయ్యగారిచేతను

ఆర్. కుప్పుస్వామిరాజుగారిచేతను

స రి చూ డ ( బ డి,

కో. లక్ష్మణ మొదలియారు వారిచే

**Third Edition 1000 Copies.**

చెన్నపురి:

శ్రీకృష్ణానంద ముద్రాలయ ముద్రితము.

1926

దీనివెల] *Registered copy-right.* [రూ. 1

# పీఠిక.

ఈ లోకోపకారమైన వైద్యగ్రంథము వైద్యానుభవముగలవారలకేగాక యితరులకు నుపయోగించునటుల తేట తెనుగున పద్యగద్యములతో వ్రాయంబడియుండుటచేత నిది ప్రతియింట నుండఁదగినది. ఇపుడు వెలియగునది మొదటిభాగము. ఇందు పదునెను సిద్ధులు చెప్పిన ఎనుబదిమూలికల నెత్తువిధము, మూలికలసంగ్రహించునపుడు పఠింపవలసిన మంత్రములు, లిఖింపవలసిన యంత్రములు చిత్రసహితముగాం జేర్పబడియున్నది. ఒక్కొక్కమూలికకుఁగల పర్యాయపదంబుల నిఘంటువు పూర్తిగా నిందుగలదు. ఆయా మూలికలచేఁ గుదురునట్టి రోగములు, ఆ రోగలక్షణములు వివరముగాఁ జెప్పంబడియున్నది. అట్లుండుటచేత నీపుస్తకమును జదువువారికి సర్వవైద్యగ్రంథంబులందుండెడు విషయములన్నియు సమగ్రముగాబోధపడుననుటకు నెట్టియభ్యంతరమును లేదు. బోలెడు ధనముపోసి వైద్యగ్రంథములను దీసి చదువుటకన్న నీగ్రంథము నొకటిని దీసికొనుట లాభకరము. ఇందు జెప్పబడియుండు విషయములన్నియు ననుభవసిద్ధములైనవి. తీసియనుభవించినవారికే దీని లాభలోభములు కనంబడును. ఇట్టి వైద్యగ్రంథము నిదివఱకు నెవరును ముద్రించియుండలేదు. కొద్దిప్రతులే ముద్రించెదము. కావలసినవారు ముందు మించికొనుఁడు. వెనుక జింతించిన లాభములేదు. కాగితలోపముచే నిటుల హెచ్చరింపవలసివచ్చెను.



దేవతాసిద్ధియగు మలయాళ మంత్రరాజీయము 2-భాగము 108 యంత్ర మంత్ర సహితముగా అచ్చువేయబడియున్నది. దీనిలో కొద్దివిషయములు యీగ్రంథమునకు వుపయోగపడును. యీగ్రంథమును అవశ్యముగా చూడవలసినది. దీని క్రయం 1-12-0

కో. లక్ష్మణ మొదలియారు,

నెం. 9, చాకలసందు, సాకాన్పేట పోస్టు, మదరాసు.



శ్రీరస్తు.

అగస్త్య వనమూలికా మర్మశాస్త్రమను

# సిద్ధమూలికారహస్యము

యంత్ర మంత్ర సహితము.

శా॥ శ్రీమద్వేంకట నాయకా నిను మదిన్ సేవించి భావించి సి।
ద్ధామోదంబు మహౌషధ ప్రకర నిత్యస్వాదు మూలంబు నేఁ।
బ్రేమన్ జేసెదఁ జిత్తగింపుమిది నిర్విఘ్నంబుగాఁ దీర్చఁగన్।
గామారి ప్రముఖామరేంద్రవినుతా? కల్యాణ శర్మప్రదా॥

తే-గీ॥ ఆంధ్రమునఁ బద్య గద్యంబు లడరసిద్ధ।
మూలికా రహస్యంబును మోదమలర।
మంత్ర యంత్ర సహితముగా మాననీయ।
మైన రోగ నిధానంబు తోనజేయ!॥

క॥ కోళప్పన్ జేరి మహా। శ్రీలక్ష్మణ మొదలియారి ప్రేరేపణచే।
లీలనురచించినాఁడను। నాలింపవెసుబ్బరాయఁడనుబుధహితుఁడన్॥

## తొలిపలుకు.

సుఖమును గోరి ప్రతి మానవుండును నేదే నొకపనిం జేయుచుండును, అట్టి పనులం జేయుటకు సాధనభూతమైనది దేహము. ఈ దేహము వ్యాధులచే క్షీణంబగును. అట్టి క్షీణతను సమకూర్చుకొనుటకై పరమకారుణ్యమూర్తులగు సిద్ధాదులు వనమూలికలను సిద్ధపఱచికొను క్రమంబును విశదపఱచియున్నవారు. అవి మూలకొక్కటి చెల్లాచెదరైయుండుటచేత నవి యెల్లఱకు నుపయోగ పడకుండుటనుగాంచి, వానినంతయుఁ గ్రోడీకరించి సిద్ధమూలికా రహస్యమను పేరున వెల్లడి

చేసెదము. ఇది యెల్లఱకు నుపయోగకారియైయుండునని సర్వదయాపరుండగు సర్వేశ్వరునిఁ బ్రార్థించెదము.

మూలికలకు శాపంబు గలదని సిద్ధులు తమ గ్రంథంబులను వ్రాసియున్నారు. నిన్న మొన్న పుట్టిన మూలికలకు శాప మెక్కడిదని కొందఱు వాదింతురు. శాపమనువారిమాటలకు నర్థము తెలియని వారలే యీతీరున జెప్పుదురుగాని యితరులు చెప్పరు. ఒక్కొక్కమూలికయందు మన వ్రేళ్లును నోళ్లును వాని యాకులమీదనో చెట్లమీదనో తగులుటయే శాపమనంబడును. అటులగాక చేయుటకు నెవ్వరితరమగును. కావున నాయా మూలికలకు ఆయా సిద్ధులుచెప్పిన మంత్ర యంత్రములనిటఁ బొందుపఱచెదము. ఒక్కొక సిద్ధుడు ఎనిమిది మూలికలకు నదియేమంత్రమును యంత్రమును వుపయోగపఱచియుండుటచే నిందు నదేమాదిరి తెలుపనయ్యెను.

కొన్నిమూలికలు తెల్లని పూవులంగలది మనకంటికగుపడుట దుర్లభము. అటులఁ గనఁబడిన నవి తోడనే మఱుగిపోవును. లేక మాఱిపోవును. కావున నట్టి మూలికలను గన్నదే యాచెట్టును బట్టుకొని యొక దారమునైనను నారనైనను గట్టియుంచి 'ఓం సిద్ధమూలీ! మహామూలీ! శివశక్తీ తిష్టతిష్టస్వాహా" యను మంత్రముచే దొమ్మిదిసారు లభిమంత్రించి వచ్చిన నది మఱుగక మాఱిపోక యటులనే నిలుచును. తనకుఁ గావలసినపుడు తన కార్యమును జేసికొన నుపయోగించును. అట్టి మూలికలకు దిగువ ధనముండుననీ పెద్దలు చెప్పుదురు. దానిచే మిగుల ప్రయోజనంబు నొసంగుననుట నిజము. ఈమూలికలకీదిగువ సిద్ధులు చెప్పినమేరకుఁ జేయకయుండినయెడల నవి మందులకుపయోగింపకపోవును. వైద్యులిచ్చెడి మందులు కొన్నివేళల రోగమునకు బట్టుటయు, బట్టకుండుటయు నీ కారణమువలన నని యెఱింగి యిట్టి మంత్రయంత్ర సహాయముచేత, మూలికను వీర్యవంతముగ జేసికొందురని ప్రార్థన.

---



# సిద్ధులు చెప్పిన మూలికల క్రమము.

1. కుంభముని (ఇతనినే యగస్త్యుండందురు):—పసపు, తిప్పతీగె, అల్లము, పిప్పలి, మారేడు, కూతురుబుడమ, పస, వెలగ.
2. భోగముని:—ఊడుగు, తెగడ, కరక్కాయ, దొండ, చండ్ర, సదాప, కొడిసె, మనుబాల.
3. మాండూక్యముని:—ఆరె, ఉసరిక, కాకర, చింతపండు, ముత్తవపులగము, పొట్ల, తేలుమణి, ములక.
4. నందీశ్వరుడు:—మేడి, ఉత్తరేణి, ఎలుకచెవి, గలిజేరు, పొన్న, గోంతెమగోమరు, బీర, జెముడు.
5. వ్యాఘ్రపాణి:—అడ్డసరము, కటుకరోహిణి, తాడికాయ, తీటకసి వెంద, పాల, ధూలగోవిల, నీలిపల్లేరు.
6. వ్యాసులు:—పెన్నేరు, ఆముదము, పీచర, జ్యోతిష్మతి, ప్రుంగ, రేల, సంబరేణు, దవనము.
7. విశ్వామిత్రుఁడు:— కురువేరు, చాగ, తక్కలి, చేతిసార, దేవదాళి, దోస, ధూసరి, తీగవేము.
8. వసిష్ఠుఁడు:—పర్పాటకము, పాపర, దంతి, గుమ్ముడు, గోరింట, వాకుడు, విషబొద్ది, అరటి.
9. గోరక్షుఁడు:—గగ్గెర, ఉమ్మెత్త, గన్నేరు, మునగ, ముల్లంగి, కాచి, తులసి, చల్లగడ్డ.
10. కొంకణుడు:—వావిలి, వెదురు, వెల్లుల్లి,గోగు, చేమంతి, జమ్మి, జువ్వ, నేరేడు.

ఈ పదువురదేగాక యింకయు మత్స్యముని, కమలముని, యోగానందుడు, నిత్యానందుడు, పినాకీశ్వరుడు, నిత్యనాథుడు, పరాశరుడు, హారతుడనువారు చెప్పిన మూలికా విశేషంబులును గలవు. అవి రెండవభాగమున ముద్రింతుము.

ఈ గ్రంథము వైద్యులకేగాక యితరులకు నుపయోగించును గావున నెల్లవారును దీనిం దీసి చదివి గ్రహింప బ్రార్థితులు.

ఇట్లు,

కార్తీక శుద్ధ పౌర్ణమి. కో. లక్ష్మణ మొదలియారు.



శ్రీరామజయం.



అగస్త్య వనమూలికా మర్మశాస్త్రమను

# సిద్ధమూలికారహస్యము

మంత్ర యంత్ర నిఘంటు సహితము.



## కుంభముని అగస్త్యుఁడు.

ఇతనిచేఁజెప్పబడిన 1_పసపు, 2_తిప్పతీగె, 3_అల్లము, 4-పిప్పలి, 5-నూరేడు, 6-నూతురుబుడమ, 7_వస, 8_వెలగ.

వీనికిఁ జేయవలసిన శాపనివర్తిక్రమము.

శుభలగ్నమునఁ జెట్టుకడకేగి దానియడుగున నేలయందు సాంబ్రాణివత్తినిబెట్టుకొని నీదిగువఁజెప్పబడినయంత్రమునువేసి యీదిగువ వ్రాయఁబడిన మంత్రమును తొమ్మిదిమాఱులుచ్చరించినయెడల శాపనివర్తియగును. పంచదార నైవేద్యముంచిన మేలు.

శాపనివర్తి.

వినాయక పూజా యంత్రము.



మంత్రము:—ఓం రీం గజ్ గణపతీ ఆవేశయావేశయ ఓం శ్రీం గణపతి శాపం నివర్తయ నివర్తయ ఓం గజ్ గణపతీ ఠటుఠటుస్వాహా.



1. పసుపు. (మంచిపసుపు, మ్రానిపసుపని రెండువిధములు.)

నిఘంటువు:—కాంచని, క్రిమిఘ్ని, గౌరి, జయ, జయంతి, తురంగిణి, దీర్ఘరంగ, నిశ, పింగ, పీత, పీతక, యోషిద్వల్లభిక, రజని, రంజని, వర్ణ, వరవర్ణిని, వర్ణావతి, విషఘ్ని, హారిద్ర, హారిద్రక, హాలది. ఈ యిరువదియొకటి మంచిపసుపు పేళ్ళు.

కాలేయక, కటంకటేరి, కుసుంభలా, దారు, దారుహారిద్రనిశ, పీతిక, పీతచందన, పీతద్రు, పీతక, పీతదారు, పచంపచ, పర్జన్య, హేమపర్ణవతి, హేమకాంత. ఈపదునైదును మ్రానిపసుపు పేళ్లు.

### గుణము.

మంచిపసుపు: చేదుగను, రూక్షగనుండును. మ్రానిపసపు: చేదు, రూక్ష, ఉష్ణమునుగలది.

### ఉపయోగము.

మంచిపసుపు: ఉష్ణము, విషము, వ్రణము, దురద, కుష్ఠము, మేహములను శాంతిపఱచును. దేహమునకు గాంతిని నైతమిచ్చును.

మ్రానిపసపు: వ్రణము, దురద, దోషము, ముఖకర్ణనేత్రరోగములఁ బోనడంచును.

### రోగనిదానము.

కుష్ఠము:—ఇది పదునెనిమిది విధములైనవి. దేహతత్వమునకు స్వభావమునకు విరోధమైన వస్తువులను భుజించుటచే నిది సంప్రాప్తమగును. కుష్ఠము వచ్చుచోటు మెత్తగగాని కఠినముగగాని యుండును. వర్ణము మాఱియుండును. కొందఱి కాచోట చెమట పట్టును. గొందఱికి జెమట పట్టదు. మంట, దురద, స్పర్శజ్ఞానరాహిత్యము, నొప్పి, వాపు గలుగును.

మేహము:—మేహము లిరువది: కఫమేహములకు – దగ్గు, పీనసము, అరుచి, అజీర్ణము, వమనము, నిద్రలు గలుగును. పిత్తమేహములకు_ పోత్తికడుపుల లింగమున నొప్పులు, బీజములపోటు, జ్వరము, మంట, దగ, నోరుపులుపు, మూర్ఛ, విరేచనము

లగును. వాత మేహములకు - వణకు, ఒమ్మదుసు, శూల, నిద్రలేమి చిక్కుట, దగ్గు శ్వాసము కలుగును.

ముఖరోగము.—ఇవి యఱువదియైదు విధములు - ఇవి పెదవులందు 8, పండ్లయందు 8, దవడలందు 9, నాలుకలో 22, గొంతున 3, చెవులలో 15, పెదవులు బద్దలగును. పైతోలు పొరలు గలిగియుండును. పెదవులయందు బొబ్బలులేచి మంటగనుండి చితుకును. పచ్చనికాంతిగలదై చల్లగ భారముగనుండును. క్రిములుసైతము పుట్టును. దంతములు వాచును, కదలును, నెత్తురు చీములు పడును. నాలుగ్రేబద్దలై ముల్లుగలుగును. నాలుక వాచును. వెచ్చనైయుండును. దవడలందు వాపుగలిగి తోలు తిత్తివలెనుండును. కంఠమున మాంసమునువృద్ధినొందించును. అన్నము దినుటకు నీళ్ళుద్రాగుటకులేక జ్వరము కలిగియుండును.

కర్ణరోగము.—పోటులుండును. వాద్యములు వినబడును. చీము గారును. వాపుండును. దురదయునుండును.

నేత్రరోగము.—నేత్రరోగములు 76. నీరుకమ్మురు, పోటు, రెప్పలు వాలకుండుట, వెంట్రుకలు నిక్కపొడుచుట, కనులు మెరమెరలాడుట, బిరుసగుట, పుసికట్టుట, కనులు పసపు తిరుగుట.

## 2. తిప్పతీగె.

నిఘంటువు.—అమృతవల్లి, అమృతా, అమృతలతా, కుమారి, కుండలి, గుడూచి, ఛిన్న, ఛిన్నమహ, చిన్నోద్భవ, వర, వత్సాదని, విశల్య, శైవ, సోమవల్లి, సోమ, చక్రలక్షణ, జీవంతి, మధుపర్ణి, తంత్రిక, దేవనిర్మిత, వయస్థమండలి. ఈ యిరువది రెండు తిప్పతీగె పేళ్లు.

### గుణము.

కారముగ, పాకముచేసిన రుచిగా, చులకనగ, ఆయురారోగ్య వర్ణనిగనుండును. మలమును గట్టిచేయును. చేదుగ, వగరుగ, ఉష్ణముగ నుండును.



### ఉపయోగము.

రక్తదోషము వాయువు వాంతి భ్రమ పాండు ప్రమేహము రక్తమూలము కాసము శ్లేష్మము దురద మేదోరోగము విసర్పము కామిల కుష్ఠు వాతరక్తము జ్వరము పిత్తము క్రిమిరోగము వీనిని బోగొట్టును. తిప్పతీగెసత్తును నేతితో సేవించిన వాయువు నడంచును. బెల్లముతో దినిన మలబద్ధమును పోగొట్టును. పంచదారతో తినిన పిత్తముపోవును. తేనెతో సేవించిన కఫమును హరించును. ఆముదముతోఁ దీసికొన్నయెడల వాతరక్తము శాంతించును. సొంటితో సేవించిన ఆమవాతమేగును.

### రోగనిదానము.

విసర్పరోగము:—ఇది యేడు విధములు. జ్వరము మూర్ఛ అతిసారము దప్పి భ్రమ శరీరమున బొబ్బలు ఎక్కిళ్లు మొదలైనవి యుండును.

కామిలారోగము:—నేత్రములు శరీరము గోళ్ళు మూత్రపురీషములు పచ్చబడును. ఇంద్రియపటుత్వము తగ్గి శరీరము చిక్కును. అరుచి కలుగును. మతిచలనము శరీరమునబాధలు దప్పియు గలుగుట కలదు.

క్రిమిరోగము:—ఇది యజీర్ణమువలన నుత్పత్తియగును. ఇవి యిరువది విధములు. క్రిములు అనగా పురువులు లోవెలి భేదంబులచే రెండువిధములు. చెమటను బుట్టునవి కొన్ని, కఫమున బుట్టునవి కొన్ని, యివి వెలిపురువులు. రక్తమున కొన్నిపుట్టును. అమేధ్యమున బుట్టినవికొన్ని యివి లోపురువులు. ఒక్కొకటి యైదువిధములవంతున నాల్గింటికి నిరువదివిధములగును. చెమటను బుట్టినవి నువ్వుగింజంత పెద్దవై యుండి తలవెంట్రుకలను గుడ్డల నాశ్రయించును. ఇవి దురదను కురుపులనుగలిగించును. అజీర్ణమునఁ దినుట, తీపు పుల్లనివస్తువుల దినుట, ద్రవపదార్థముల నవారిగా దినుట, బెల్లముగలిసిన పిండిని తినుట, నడువకుండుట, పగలు నిదిరించుట, విరుద్ధపదార్థములను దిను

టచే ఉదరమున పురువులుపుట్టును. మినపపిండి, పులుసు, ఉప్పు, బెల్లము, పసరాకుకూర వీనినిదినుటచే నమేధ్యమున బురుగులు పుట్టును. మాంసము చేపలు బెల్లము పాలు పెరుగు పిండి వీనిచే కఫమున పురువులు పుట్టును. విరుద్ధములగు నజీర్ణవస్తువులతినుటచే రక్తమునక్రిములుపుట్టును. ఇట్టివారికి జ్వరము, శరీరమున కాంతితగ్గుట, శూల, రొమ్ములలో నలుపు, చిక్కుట, అన్నద్వేషము, అతిసారము, భ్రాంతిని గలిగించును.

## 3. అల్లము.

నిఘంటువు:—ఆర్ద్రకము, ఆర్ద్రవిశ్వ, కటు, కటుకము, ఘన, తారకము, భద్రము, భద్రకము, భేషజము, నుదర్ణకము, శృంగి యీ పదునొక్కటి అల్లముపేళ్లు.

### గుణము.

అల్లము కారముగ నుండును.

### ఉపయోగము.

శూల, శ్లేష్మము, పాండు, వాతము, అరుచి, అగ్నిమాంద్యము, త్రిదోషములను హరించి ధాతుపుష్టిని గలిగించును.

### రోగ నిదానము.

పాండురోగము:—ఇది యైదువిధములు. వాత పిత్తకఫములు మూడు, సన్నిపాతమువలన నొకటి. మంటినిదినుటచేనొకటి కలుగును. అధికముగాదిఱుగుట, పులుపుపదార్థములను, ఉప్పును, కల్లును, మన్నుతినుట, పగలునిద్రించుట వీనిచే రక్తమాంసములు చెడి శరీరము పగులును, ఉమ్మియూరును, దేహము సన్ననగును, కనులుబ్బును, మలమూత్రములు పచ్చనగును, ఆహారము జీర్ణముకాదు, మంటిపై నిచ్ఛ కలుగును. ఇది రోగారంభము. పిదప నది వాతగతమైనయెడల, దేహము బూడిదవర్ణమును, మూత్రము నలుపుగను, కనులెఱుపగును. నొప్పులు వణకు మల మూత్ర బద్ధకములగును. పైత్యగతమైనయెడల మూత్ర



పురీషములు నేత్రములు పచ్చబడును. దాహము, తాపము, జ్వరములు వచ్చును. విరేచనము పచ్చగనగును. కఫగతమైన యెడల గల్లపడును. వాచును. మతిభ్రమయగును. మాంద్యమై శరీరము భారమై, దేహనేత్రమూత్రములు తెల్లపడును. సన్నిపాతగతమైనయెడల జ్వరము, అరుచి, గుండెలోమంట, వాంతి దాహము, ఆయాసము, దేహము చిక్కుట, జ్ఞానేంద్రియముల బలము తగ్గుట కలుగు. దీనికి వైద్యము లేదు. మన్ను దిను వారికి వాతపిత్తశ్లేష్మములలో నేదైన నొకటి యధికరించును. వగరైన మన్ను వాయువును వృద్ధిపఱచును. ఉప్పుమన్ను పిత్తమును బెంచును. తీపుమన్ను కఫమును వృద్ధిచేయును. ఇది యీ రసములను వృద్ధినందించి యన్నరసముపోవునాడుల నదికట్టి యింద్రియ బలమును, కాంతిని, శక్తి నడంచి బలమును, శరీరకాంతిని, జఠరాగ్నిని తగ్గింపఁజేసి పాండురోగమును గలిగించును. పాండురోగ సామాన్యలక్షణం బెదియన: కనులు, గవుదలు, కనుబొమ్మలు పైకి పొంగియుండును. బొడ్డు, కాళ్లు, లింగముబ్బియుండును. మలము నెత్తురుజిగటతో భేదియగును.

## 4. పిప్పలి.

పిప్పలి వేరును మోడియందురు. చవ్యఫలమును గజపిప్పలి యందురు.

నిఘంటువు (పిప్పలి):—ఉపకుల్య, ఊషణ, కటు, కఫరి, కణ, కృష్ణ, కృష్ణఫల, చపల, కాలి, శౌండిక, తిక్తతండుల, పిప్పలి, మాగధి, తీక్ష్ణతండుల, కోల, శౌండి, వృష్య, దండపల, వైదేహి యివి పిప్పలి పేళ్ళు.

నిఘంటువు (పిప్పలీమూలము_మోడి):—మూలము, పిప్పలీమూలము, గ్రంధిక, జటిల, శిరము, కోలమూలము, కటు, గంధి, సర్వగ్రంధి, విరూపకము, మూలకము, మూషణము, కోలపత్రాగ్రము, పాణితము, జట యివి మోడి పేళ్ళు.

నిఘంటువు (చవ్యము):—చవిక, కోలవల్లి, చవ్యము, పావనము, తురము, కోపసిరము, తీక్ష్ణము, కోలకము, కూటమస్తకము ఇవి చవ్యము పేళ్ళు.

నిఘంటువు (చవ్యఫలము_గజపిప్పలి):—శ్రేయసి, హస్తిపిప్పలి, కణ, నాగకణ, కుంచ, కృత్రిమము, చవికాఫలము ఇవి గజపిప్పలి పేళ్ళు.

గుణము.

పిప్పలి కారముగ, రుచికరముగ, శీతలముగ, జిగటగనుండును. చవ్యము కారముగ, నుష్ణముగ నుండును. గజపిప్పలి స్వాదుగ, కారముగ, నుష్ణముగ నుండును.

ఉపయోగము.

పిప్పలి: గుల్మములు, త్రిదోషములు, దప్పి, దాహము, మహోదరము, ఆమవాతముల నివర్తించి బలకరమైయుండును. మోడి: శ్లేష్మము, కాసము, గుల్మము, వాతము, క్రిమిరోగము, హృద్రోగము, పాండువు, వాపు, అగ్నిమాంద్యము వీనిని బోగొట్టును. చవ్యము: కుష్ఠువు, హృద్రోగము, శూల, కఫము, వాతముల హరించును. గజపిప్పలి: బలాసము, వాతము, జంతువాతము, నేత్రరోగము, అగ్నిమాంద్యము, కాసము, శ్వాసము, ఆమవాతము వీనిని నివర్తించి యగ్నిదీపనమును గలిగించి ధాతుపుష్టిని గలుగంజేయును.

ఈ నాలుగు నొకదాని నొకటి యనుసరించియుండుటచే నొకటిగా వ్రాయడమైనది. నామసామాన్యముచేతను జేర్పంబడియున్నది.

కాసరోగము:—నోటికి పొగతగులుటచే, మిగుల కారమైన యన్నము భుజించుటచే, పురీషాదుల నడ్డగించుటచే, ప్రాణవాయువు దానంబుతోఁ గలిసి దుష్టమై వెలికి కంచుపాత్ర ధ్వనికలిగివచ్చును. ఇదియే కాస యనంబడును. కాస లైదు తెఱంగులు. వాతపిత్తశ్లేష్మములచే మూఁడు. క్షతమొకటి, క్షయరోగ మొకటి. ధాన్యము మొదలగువానిపొట్టు గొంతులో జేరినను, ఇష్టములేని భోజనమును బలవంతముగా దినుటచే కాస గలుగును. దీని



సామాన్యలక్షణంబు లేవియనిన: రొమ్మున, నుదుట, తలను, ప్రక్కలను నొప్పి గలుగును. ముఖమెండును. బలము, ధ్వని, కాంతి తఱిగి యుమ్మియు కఫమును లేక దగ్గుట, కాస, రొమ్మున మంట, జ్వరము, నోరెండుట, నాలుక చేదు, ఏదైన త్రాగిన వాంతి యీలక్షణములు పైత్యకాసకుండును. కఫముతో గూడి తలనొప్పి గలిగి యన్నమం దిచ్ఛలేక దేహమున దురదయున్న కఫ కాస, దెబ్బతగిలి వచ్చిన దగ్గు క్షతము.

గుల్మరోగము:—అన్నకోశము ఆమకోశమునకు మధ్య ముద్దగనుండునది గుల్మము. ఇది కుడి యెడమ ప్రక్కలు రెండు. రొమ్ము, బొడ్డు, పొత్తికడుపు వీనియందు బుట్టును. వాతపిత్తశ్లేష్మ సన్నిపాతరక్తములని యైదువిధములు. ఇది తిరుగుచుగాని తిరుగక గాని యుండును. ఈ రోగము పుట్టుటకుమునుపు పులితేపులు వచ్చును. మలము బంధించును. పేగు లఱచును. నొప్పి మెత్తును. ఉబ్బును.

చికిత్సాక్రమము.

1. మానిపసపు, తిప్పతీగ, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు వీనిని సమభాగములుగా దంచి కషాయము బెట్టి యొక నెల పుచ్చుకొనిన కుష్ఠము, చర్మదోషము, వ్రణశోఫలు తీరును.

2. పిప్పళ్లు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, వాయువిళంగములు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి కొంచెము తేనె కలిపి పుచ్చుకొనిన కుష్టువు, జంతురోగము, మేహము, అస్థివ్రణములు, భగందరములు పోవును.

3. పసుపు, మానిపసుపు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, వెఱ్ఱిపుచ్చ వేరు, తుంగగడ్డలు సమభాగములుగ దంచి కషాయముబెట్టి తగినంత తేనెను వదలి సేవించిన సమస్తమేహములు పోవును.

4. తిప్పతీగ, జాపత్రి, దీపదారు, దురదగొండివేరు, మానిపసపు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు వీనిని సమభాగ

ములు దంచి కషాయము పెట్టి యందు తేనెకలిపి పుక్కిలించి యుమ్మి వేసిన నోటిపుండ్లు (ముఖరోగము) తీరును.

5. అల్లము, నేరేడుచిగుళ్ళు, మామిడిచిగుళ్ళు, వెలగకాయ, పత్తికాయలు ఇవి సమభాగములు దంచి రసముతీసి తేనెకలిపికొంచెము వెచ్చఁజేసి చెవులయందు పోసిన చీముకారుట, పోట్లు, వ్రణములు హరించును.

6. పసపు-మానిపసపు- కావిరాయి - లొద్దుగపట్ట - ఉసరిక వరుగు-కరక్కాయలు - తానికాయలు వీనిని సమభాగములుగ దంచి కషాయము పెట్టి కనులను గడుగవలెను. అటువెనుక కావిరాయి-శ్రీగంధము-రసాంజనము వీని గంధముతీసి కనులకు చుట్టును బట్టువేసిన నేత్రరోగములు హరించును.

7. తిప్పతీగె రసములో నెయ్యి పాలు కలిపిత్రాగిన హలీమక కామిల హరించును.

8. పిప్పళ్ళు - మిరియాలు-శొంఠి - వన-వేపవిత్తులు - కొడిశవిత్తులు- చండ్రచావ- కరక్కాయలు - తానికాయలు - నెల్లినగుగు-తెల్ల తెగడ వీనిని సమభాగములుగదంచి గోమూత్రముకలిపి కషాయము పెట్టి యేడుదినములు పుచ్చుకొనిన ఉదరక్రిములు నశించును.

9. తిప్పతీగ-తుంగగడ్డలు-గంటుభారంగి-ఎఱ్ఱ ఆముదపువేరు-కోలపొన్న వీనిని సమభాగములుగ దంచి కషాయము జెట్టి యందు పిప్పలిచూర్ణము కలిపి త్రావిన శ్వాసకాసలు హరించును.



5. మారేడు.

ఇది రెండువిధములు. మారేడు - కాకిమారేడు అని.

నిఘంటువు:—బిల్వము - శలాటు-శాండిల్య - హృద్యగంధ- మహాఫల-శైలూష- శ్రీఫల- కంటక- పూతిమారుత- మహాకపిత్థ- మాంగల్య- మయూర- నీలమల్లిక- ద్రుమ- పీతఫల - మోహారీతకి ఇవి మారేడు పేళ్ళు.

లక్ష్మీఫలము, గంధగర్భ, సత్యకర్మ, వరారుహ, వాతసార, రుభూర, కంటకారి, అసితానన ఇవి కాకిమారేడు పేళ్లు.



గుణోపయోగములు.

మారేడు కాకిమారేడు రెండును విరేచనమును, దీపనమును గలుగ జేయుటగాక లఘువాతమును హరించును. దీనివ్రేళ్ళను గషాయము౦చి సేవించిన జ్వరము, శూల, మూత్రకృచ్ఛ్రము పోవును.

రోగ నిదానము.

జ్వరరోగము:—ఇది యెనిమిది విధములు. చెమటపట్టుట, దేహేంద్రియ మనంబుల సంతాపము, శరీరమంతనొప్పి యివియొకటే సారితోచిన ఒకటితగ్గి తోచినను జ్వరమనఁబడును. దేహమలయును. దేనియందు నిచ్ఛలేకుండును. దేహకాంతి తగ్గును. నోరు గబ్బుకొట్టును. కనులనీరుగ్రమ్మును. ఆవలింతలు, ఒడలి విఱుపు, పులితేపులు, గగుర్పాటు చలి యివి జ్వరసామాన్య గుణములు.

శూలరోగము:—ఇది యెనిమిదివిధములు. దీనికి వాతమే ప్రధానము. ఇది శూలములతో బొడిచినట్లుండును. అందు వాతశూల ఎద ఱొమ్మున రెండుప్రక్కలందు వీపున కటిప్రదేశమున పొత్తి కడుపునఁ గలుగును. ఇది జీర్ణకాలమున లేక ప్రదోషమున, వానకాలమున, చలికాలమున నధికమగును. మాటిమాటికి శాంతిపొందుట, ప్రకోపించుట, మలబద్ధము, ఉచ్ఛ్వాసనిశ్వాసబంధము, పోటు, భేదించుట యివియుండును. మాటిమాటికి వచ్చును. ఆవిరిపట్టుట, అభ్యంగనస్నానము, శరీరమర్దనము, వేడియన్నము, చమురు గలిసిన యన్నము వీనిచే నుపశమించును. పైత్యశూలకు నాభిలో నధికబాధయుండును. దాహము-భ్రమ-తాపము-చెమట-మూర్ఛ మత్తులుండును. నడురేయిని అన్నజీర్ణకాలమున, శరత్కాలమున నధికమగును. శీతకాలమున శీతోపచారములచేత మధురశీతలాన్నములచే శాంతి నందును. శ్లేష్మశూలయందు ఱొమ్మున మంట, దగ్గు, మత్తు, అరుచి, చెమట, ఆమాశయమున నిశ్చలత్వము, తల బరువుగ

నుండును. భుజింపగానే నొప్పియెత్తును. సూర్యోదయమున శిశిరవసంతకాలముల నధికమగును.

మూత్రకృచ్ఛ్రరోగము:—మూత్రమును ధారాళముగా విడువజాలక కొంచెము కొంచెముకష్టముతో వదలుట ఇవి యెనిమిది విధములు. వాతపిత్తశ్లేష్మములచేమూడు. సన్నిపాతమొకటి. శల్య పురీష శుక్రాశ్మరులంబుట్టినవి నాలుగు. వాతముచేనైనయెడల గజ్జలు పొత్తికడుపు శిశ్నము వీనియందు తీవ్రమైన బాధగలిగి పలుమారు ఉచ్చవచ్చును. పచ్చగా ఎఱ్ఱగ బాధగ మంటగ నుండిన పైత్యజము. పొత్తికడుపు లింగముబరువైనను వాచినను మూత్రము గడ్డకట్టినయెడల కఫజము. ఈ మూడులక్షణంబులంగలది సన్నిపాతజము. మూత్రనాడులు శల్యక్షతములైన శల్యజము. పురీష మడ్డగింపబడుటచేనైనది పురీషజము. కడుపుబ్బుటచే వాతశూలముచేనైనది అశ్మరీజము. శుక్రముతోగూడి పొత్తికడుపు లింగమున నొప్పి గలిగి మూత్రము వచ్చిన శుక్రజము.

---

## 6. కూతురుబుడమ.

నిఘంటువు:—ఏలావాలుక ఐలేయ సుగంధి హరివాలుక ఏలూాలక కపిత్థ దుర్వర్ణా ప్రసర దృఢ లోహిత గిరీంద్ర శైలజ గిరినామక యివి కూతురుబుడమపేళ్ళు.

### గుణోపయోగములు.

ఇది చేదుగ నుష్ణముగ పరిమళంబుగనుండును. శ్లేష్మ వాత భ్రమ కుష్ఠ ప్రమేహ విష వ్రణముల హరించును.

### రోగనిదానము.

భ్రమరోగము:—పైత్యముచే చీకటి కమ్మినట్లును, పైత్యవాతముచే దుమ్ము కమ్మినట్లును, వాత కఫములచే చీకటితొందరగను శ్లేష్మపైత్యములచే నిద్రయు గిరగిర తిరిగినట్లుండును. భూమి పైఁబడును.

వ్రణరోగము:—వ్రణములు శారీరము - ఆగంతుకమని రెండు విధములు. వాతపిత్తశ్లేష్మజము శారీరము. శస్త్రాదులచేఁ గలుగునది ఆగంతుకము: వాతవ్రణము స్తంభించి, కఠినస్పర్శ గలిగి కొంచెమురసిగలిగి మిగుల పోటుగలిగియుండును. సూదులతో గ్రుచ్చినట్లుండుటయేగాక నిగనిగలాడుచు దుమ్మువన్నెగలదై యుండును. పిత్తవ్రణమున దప్పి, మోహము, జ్వరము, చెమట, తాపము, దురదగలిగియుండును. దుర్గంధముగు రసియోచీమో కాఱును. శ్లేష్మవ్రణము గడ్డకట్టి భారమై నునుపుగ నిశ్చలముగ స్వల్ప వేదనంగలిగియుండును. తెలుపువర్ణము గలిగి కొద్దిగా చెమర్చును. చాలకాలమునకుగాని పక్వముకాదు. రక్తదోష సంబంధమయినయెడల నెత్తురుకాఱును. ఇది వాతపిత్తకఫములతోఁగలిసి మూడువిధములగును. ద్వంద్వముతోఁ గలిసి మూడు. సన్నిపాతముతోఁ మూడు. రక్తముతోఁ మూడు. ఇటుల పదునైదువిధములయ్యెను. వ్రణములు మర్మస్థానమున లేక చర్మగతమాంసగతములైన చికిత్సకు సులభము. ఈ పైచెప్పినగుణములతోఁ దప్పిదగ మొదలైనవియుండెనేని వ్రణము కష్టసాధ్యము. మిగుల నుపద్రవమునిచ్చుచు చెడుగబ్బుగలిగి, చాలకాలమునుండి నిలవయుండి చీము నెత్తురు కలిసిన రసిని వదలుచుండిన వ్రణ మసాధ్యము.

---

## 7. వస.

ఇది రెండు విధములు. వస, తెల్లవస యని.

నిఘంటువు:—వచ, ఉగ్రగంధ, గోలోమి, జటిల, ఉగ్ర, లోచన, షడ్గ్రంథ, విజయ, క్షుద్ర, మంగల్య, హేమవతి యివి వసపేళ్ళు. శ్వేతవచ, మేధ్య, శతపర్ణి, ఝంటిక ఇవి తెల్లవస పేళ్ళు.

### గుణోపయోగములు.

ఇవి రెండును చేదుగ నుష్ణముగ నుండును. ఇవి వాతము, శ్లేష్మము, క్రిమిరోగము, కడుపుబ్బరము, శూలవీనిని నివర్తించును. కంఠమునకు సుస్వరమును గలుగఁ జేయును. ఇది వాంతిని జేయును.

## 8. వెలగ.

నిఘంటువు:—కపిత్థము, దధిత్థము, గ్రాహీఫలము, సుగంధిక, అజ నస్యము, దధిఫలము, చిరపాకి, కపిప్రియ, గంధపత్ర, హృద్య గంధ, దంతశార, విశాలక, సితపుష్ప, పయస్సు, క్షీరము, పుష్పఫలి యివి వెలగపేర్లు.

### గుణోపయోగములు.

ఇది మలబద్ధకమై శీతలముగనుండును. స్వరము, కఫము వీనిని నశింపఁజేయును. దీనిపండు మధురముగ, పుల్లగ, గురుత్వముగనుం డును. శ్వాసము, కాసము, అరుచి, దప్పి వీనిని నివర్తింప జేయుట గాక కంఠశుద్ధిని గలుగజేయును.

### రోగ నిదానము.

శ్వాసరోగము:—మహాశ్వాసము, ఊర్ధ్వశ్వాసము, ఛిన్నశ్వాసము, తమకశ్వాసము, క్షుద్రశ్వాసమని యైదువిధములు. కొలిమి తిత్తిలోనుండి గాలివచ్చునట్లు వచ్చునది మహాశ్వాసము. దీని చేతనే యూర్ధ్వశ్వాసము కలుగును. కఫవాతము లధికమగు టచే ఛిన్నశ్వాసము పుట్టును. కఫ మధికమగుటచే తమక శ్వాసముకలుగును. వాతమధికమగుటచే క్షుద్రశ్వాసముజనిం చును. యీ శ్వాసరోగ ముదయించుటకు మునుపు ఱొమ్ము నందు నొప్పి, శూల, కడుపుబ్బరము, మలమూత్రనిర్బంధము, ముఖము వాడుట, కంఠములోనుండి ధ్వని రాకుండుట యివి యుండును.

దాహరోగము:—ఇది యేడు విధములు. వాత పిత్త శ్లేష్మములచే మూడు, దెబ్బ గాయములచే గలుగునది యొకటి, క్షయము ఆమదోషముచే రెండు, భోజన పదార్థములచే నొకటి, వాత దాహమునకు ముఖమెండును. కళతప్పును. గొంతున తలను నొప్పియుండును. చన్నీళ్లుత్రావిన మఱింత హెచ్చును, పైత్య దాహమునకు మూర్ఛ, అన్నద్వేషము, రోదనము, తాపము, కన్ను లెఱ్ఱనగుట, అతిదాహము, చల్లగాలిపై నిచ్ఛ, చల్లవస్తు



వులపై ప్రేమ-నోరు చేదు - మల మూత్రములు పచ్చనగుట- యిట్టి గుణములుండును. కఫదాహమున నిద్ర కడుపుభారము నోటితీపు అతిదాహము కలుగును.

### చికిత్సా క్రమము.

1. బెల్లము అల్లము నువ్వులు వీనిని సమభాగములుగ నూరి ముద్దచేసి యుసరికకాయంత తినినయెడల పరిణామశూలలు పోవును. వస ఇంగువ కరక్కాయలు వాయువిళంగములు వీనిని సమభాగము లుగ చూర్ణముచేసి వేడినీళ్లతో పుచ్చుకొనినయెడల ఆనాహశూల, హృద్రోగము, విషూచి, గుల్మము వాతము వీనిని హరించును.

2. శుద్ధిజేసినపాదరసము ఒకభాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు వీనిని తెల్లగలిజేరు రసముచే నొకదినము ఖల్వమునందు జక్కగామర్దించి బిళ్లచేసి నీడలోనెండించి ప్రమిదెయందుంచి దానిపై వేఱొక ప్రమిదను గప్పి చీలమన్ను లేపనము జేసి సూర్యపుటమునం దుంచి పిదప నొకకుండలో నిసుకబోసి యందు నాప్రమిదెను బూడ్చి మఱల నిసుకబోసి యా కుండమూతిని మూకుడుతో గప్పి చీలమన్ను చేసి యెండించి భూమియందు తగుమాత్రమైన పల్లము త్రవ్వి దాని చుట్టు పిడకలుపఱచి పైకుండను నడుమఁబెట్టి మఱల నాకుండను పిడ కలచే గప్పి గజపుటము వేసి స్వాంగశీతలము నాకుండను దీసి దానికి సమముగ కొండపిండివేళ్లచూర్ణమును కలిపి ఖల్వమున మర్దించి దేహ తత్వమెఱింగి పూటకు రెండు వరహాలయెత్తు చూర్ణమును యుక్తమగు ననుపానముతో సేవించినయెడల అశ్మరులన్నియు నశించును.

3. పసపు, మానిపసపు, వేపాకు, అతిమధురము, సైంధవ లవణము, నువ్వులు, తెల్లతెగడ వీనిని సమభాగములుగ చూర్ణము జేసి యందు తేనెగలిపి వ్రణములకు లేపనముచేసిన నివర్తియగును.

4. పిప్పళ్లు, శొంఠి, కరకపువ్వు, కచ్చూరములు, దీపద్రాక్ష, గంటుభారంగి వీనిని సమభాగములుగ చూర్ణము గావించి యందు బెల్లము, ఆవనూనె కలిపి లేహపక్వముగ వండి ఒకతులము భుజించిన యెడల వాతశ్వాస కాసలు హరించును.

5. చిక్కని మజ్జిగలో చక్కెరవేసి యందు వరిపేల పిండికలిపి తాగిన యెండవలన గలిగిన దాహము తీరును. గానుగపిండిని పుల్లని కలితోనూరి దేహమునకులేపనముజేసిన నెండవలనగలిగెడుదాహము తీరును.

# భోగరుషి.

ఇతనిచేఁ జెప్పఁబడిన 1_ఊడుగు, 2_తెగడ, 3_కరక్కాయ, 4_దొండ, 5_చంద్ర, 6_సదాప, 7_కొడిసె, 8_మనుబాల.

వీనికిఁ జేయవలసిన శాపనివర్తి క్రమము.

శుభలగ్నమునందు నీ మూలికల చెంతకేగి సాంబ్రాణివత్తిని గాల్చియుంచి యీశాన్యముఖంబుగ గూర్చొని, యీ దిగువ జూపిన యంత్రమును వ్రాసి తొమ్మిదిమారు లీదిగువ వ్రాసిన మంత్రంబును జపించినయెడల శాపనివర్తియగును. నైవేద్య పురటిపండు.

ఆకర్షణ యంత్రము.




మంత్రము:—హ్రీం హ్రైం క్లీం హశాం సాం ఓం రవణభవశ పటుపటు స్వాహా.



## 1. ఊడుగ.

నిఘంటువు:—అంకోలము, అంకోలకము, అంకోలి, దీర్ఘమూలక, అపీతసార- తామ్రఫల- గంధపుష్ప- నికోచక - కతోరమల్లిక- గ్రాహి- వామన- లంబపర్ణిక ఇవి ఊడుగ పేళ్లు.

గుణోపయోగములు.

ఊడుగ స్నిగ్ధముగ రూక్షముగ ఉష్ణముగ నుండును. కఫము- రక్తదోషము- అతిసారము- కోతివిషము- పందికొక్కువిషము- క్రిమి రోగము- కుష్ఠము- వ్రణము- వీనినిబోగొట్టును. పిత్తవికారములందును విరేచకమునకును సేవించుట శ్రేష్ఠము.

రోగ నిదానము.

అతిసారరోగము:—అణుగని మినుములు మొదలగువానిని అధికమైన నూనెలో వండినవానిని కాకయు వేడియగు వస్తువులను చల్లనైన వస్తువులను భుజించుటచేతను అజీర్ణముగనుండ భుజించుటచేతను కాలము నతిక్రమించి తినుటచేతను నూనెత్రాగుటచే-విసారభోజనముచే- అపక్వపదార్థములభుజించుటచే- విషభక్షణచే- భయముచే- నేడ్చుటచే- మురికినీరుత్రాగుటచే- అధికంబుగ మద్యమును బుచ్చుకొనుటచే- బహుకాలము నీటిలో నీదుటచే- బలమైన దెబ్బలచే- క్రిమిదోషములచే అతిసారము పుట్టుచున్నది. ఉదకధాతువు మలముతో గలసి జఠరాగ్ని నార్పి తాను వృద్ధినొంది అపానమార్గమున స్రవించును. ఇది యాఱువిధములు. ఈయతిసారముపుట్టుటకుముందు ఱొమ్ము- బొడ్డు- అపానము- పొట్ట- కడుపు వీనియందు నొప్పి కలుగును. శరీరము తీపులు తీయును. వాయునిరోధమగును. ఇవి పురీషముతో గలియుటచే పులితేపులు- అపాన వాయువులు బైలు వెడలును.

## 2. తెగడ.

ఇది నల్ల- తెల్ల- ఎఱ్ఱయను భేదములచే మూడువిధములు.

నిఘంటువు:—శ్యామ- త్రివృత్ - మాళవిక- మసు- విదళ-కాలార్ధ-

చంద్ర-కాళింది-సుషేణ- కాలమేషిక- కాలవల్లి- మయూర-తామ్రపుష్పిక- కోశఫల-చరట- ఐషిక-కందుక-మహాశ్యామ-నళిక-నింబకంటక- భృహచ్ఛద-మరుద్వేగ- షూత-నాగర ఇవి నల్లతెగడ పేళ్ళు.

శుక్లకేశి-త్రిభిండి-కాకాక్షి- సరళ-త్రివృత్-సర్వానుభూతి త్రిపుట-త్ర్యష్ఠ-కుంభప్రగంధిని-వ్యాఘ్రాదని-నిసూత్ర-బకాక్షి క్షీరనాళిక ఇవి తెల్ల తెగడ పేళ్ళు.

కాళింది- త్రిపుట- తామ్రపుష్పిక- కులవర్ణ- మసూరి-వ్యాకృత-ఆననకాళిక యివి యెఱ్ఱ తెగడ పేళ్ళు.

గుణోపయోగములు.

నల్లతెగడ కారముగ, చేదుగ, నుష్ణముగనుండును. ఇది క్రిమి రోగము, శ్లేష్మరోగము, ఉదరరోగము,జ్వరము, శోఫ, పాండురోగము ప్లీహము, గుల్మము వీనిని హరించును. విరేచనకారి. తెల్లతెగడ వగరుగ- మధురముగ- రూక్షముగ- పాకముచేఁ జేదుగ నుండును. ఇది కఫము పిత్తము వీనిని బోఁగొట్టి అగ్నిదీపనమును గలిగించును. ఎఱ్ఱ తెగడ మధురముగ-రూక్షముగ-వగరుగ-చేదుగ-కారముగనుండును. వాతమును జేయును. విరేచనకారి. మలస్తంభము- గ్రహణి- కఫోదరము- వాపు- పాండువు- క్రిములు-ప్లీహము-జ్వరము- పిత్తము-కఫము వాతరక్తము- ఉదావర్తము- హృద్రోగములను ఖండించును.

గ్రహణిరోగము:—అతిసారము కుదురైనవెనుక ఆకలి విశేషముగాఁ గలుగకమునుపే అపత్యవస్తువులను దినుటవలనను- అజీర్ణమున అహితవస్తువులను దినుటవలనను గ్రహణి కలుగును. ఇది నాలుగు విధములు వాత పిత్త శ్లేష్మ సన్నిపాతములని. గ్రహణియందు తినినవస్తువులఱుగవు. నొప్పియు మాటిమాటికి దుర్గంధ మలంబు వెలుపడును. దాహము- మందము- బలక్షయము- ఆలస్యముగ జీర్ణమగుట. శరీరభారము ఇవి గ్రహణీ పూర్వరూపము.





3. కరక్కాయ.

నిఘంటువు:—హారీతకి- అభయ- పథ్యా- ప్రపథ్యా- పూతన- అమృత జయ- అమోఘ- హైమవతి- వయస- శ్రేయసి- శివ- నిమ్నని-ప్రాణదా- రోహిణి- రుద్రవారుణి ఇవి కరక్కాయ పేళ్లు.

గుణోపయోగాదులు.

కరక్కాయ పరమేశ్వరుని గృహంబునఁబుట్టినది. పచ్చగనుండి రోగములన్నింటిని హరింపఁజేయునదిగుటచే హారీతకి యనంబడును. ఇంద్రుఁ డమృతపానంబు సేయునపుడు ఏడమృతబిందువులు భూమిపైం బడి మనుజుల మేలునకై యేడు విధములైనవి. అవి వరుసగా జీవన్తి- పూతన- అమృత- విజయ- అభయ- రోహిణి- చేతకియని యేడు విధములైయుండును. వీనిలో విజయ యనునదియే ప్రధానమగుటం జేసి సర్వరోగంబుల నుపయోగయోగ్యము. మనుజుల జీవితకాలమును వృద్ధిసేయుటవలన జీవంతియనియు- దేహమును బరిశుద్ధపఱచుటచే పూతనయనియు- అమృతసమంబైయుండుటచే అమృతయనియు- జయంబొసంగుటచే విజయయనియు- భయమును బోఁగొట్టుటచే అభయయనియు- మేలగు గుణమునిచ్చుటచే రోహిణియనియు- జ్ఞానము నొసంగుటచే చేతకియనియు బిలువంబడును. కాశ్మీరమున జీవంతి- సౌరాష్ట్రమునపూతన- గంగాతీరమునఅమృత- వింధ్యదేశమున విజయ- వింధ్యపర్వతమున అభయ- కన్యాకుబ్జమున రోహిణి- హిమవత్పర్వతమునఁ జేతకి బుట్టును. బంగారువర్ణముకలది జీవంతి- నరములతోఁగూడియుండునది పూతన- అధికమజ్జగలది అమృత- సొరకాయవలె నుండునది విజయ- అయిదంచులుగలది అభయ- గుండ్రముగనుండునదిరోహిణి- మూడంచులనుగలది చేతకి- సర్వరోగములకు జీవంతి - లేపనమునకు పూతన- శరీరశోధనకు అమృత- సర్వరోహారణమునందు విజయ- నేత్రరోగమునకు అభయ- వ్రణముల నార్చుటకు రోహిణి- చూర్ణయోగమునకు చేతకి యుపయోగించును. కాలక్రమముగ చక్కగా బండి భూమిపైరాలినది. క్రొత్తగ నున్నగ గట్టిగ గుండ్రముగ లావుగ నీళ్లయందువేసిన మునుగునదిగ నెఱ్ఱగ గిల్లిచూచిన బెల్లపువన్నె కలదిగ

కొంచెము వగరుగ బెరడుండి రసయుక్తమై చిన్నవిత్తులంగల కరక్కాయ మేలయినది. ఇట్టిది సకల రోగములం బోగొట్టి సద్గుణంబుల నొసంగును. కరక్కాయవిత్తు దాని యస్థి యివి చేదుగ- మధ్యభాగము మధురముగ- బెరడు కారముగ- మాంసము పుల్లగ- వగరుగనుండుటచేత నిది యైదురసంబులంగలది. ఇది యుప్పగను మిగుల వగరునిచ్చును. కాక చేయును. ఉష్ణముగనుండి యగ్నిదీపనమును కలిగించును. బుద్ధి బలము నిచ్చును. పాకముచేసిన రుచిగ ఆయురారోగ్యవర్ధనకారిగ వేగముగలదిగనుండును. శుక్లవృద్ధిని నేత్రహితమును శరీరపుష్టిని కలుగంజేసి తేలికనిచ్చును. శ్వాసము- కాసము- ప్రమేహము-మూలశంక-కుష్టువు- వాపు-ఉదరరోగము- నులిపురుగులు- స్వరభంగము-గ్రహణి-మలబద్ధము- విషమజ్వరము-గుల్మము- వ్రణములు-వాంతి-ఎక్కిళ్ళు-దురద- హృద్రోగము- స్రోతోబంధము- పాండు-ఊరుస్తంభము- అరుచి-కామిల-శూల-కడుపుబ్బరము-ప్లీహము వీనిని నశింపఁజేయును. కరక్కాయ తీపుగ పుల్లగనుండుటచే వాతమును, వగరుగనుండుటచే పిత్తమును, కారముగనుండుటచే కఫమును హరించు. దీనినినూరి పుచ్చుకొనిన విరేచనమగును. ఉడికించి పుచ్చుకొనిన మలమును గట్టిపరచును. వేయించి పుచ్చుకొనిన అగ్నిదోషమును మాన్పును. చేతకియను కరక్కాయను చేతనుంచుకొనియుండువరకు విరేచనములగును. మేలయిన కరక్కాయను తినిన- వాసన జూచిన - తాకినఁ జూచిన మలము వెడలును. కరక్కాయ నరులకు తల్లివంటిది. సుఖప్రద రసాయనము- మలమూత్రములు- సప్తమలములు వీనిని చక్కగాశోధించును. దప్పి-గొంతెండుట-హనుస్తంభము-గళగ్రహము-నవజ్వరములు- శరీరక్షయము - మార్గాయాసము - హీనరేతస్సు - రూక్షకృశత్వము- లంఘనముచే జిక్కుట - పిత్తరోగమివిగలవారును - గర్భిణిస్త్రీలును- రక్తస్రావము చేయబడిన వారలును కరక్కాయను దినరాదు. కరక్కాయను బెల్లము తైలముతో సేవించిన వాతప్రకోపమును- నెయ్యిచక్కెర వీనితో సేవించిన పిత్తప్రకోపమును- తేనె పిప్పళ్ళతో సేవించినఁ గఫప్రకోపమును నశింపఁజేయును. ఎండకాలమున బెల్లముతో వానకాలమున సైంధవలవణముతో- శరత్కాలమున తెల్లచక్కెరతో



చలికాలమున సొంటితో, శిశిరమున పిప్పళ్లతో-వసంతమున తేనెతో సేవించినయెడల సర్వరోగంబుల సంహరించును.

### రోగ నిదానము.

అర్శో (మూలశంక) రోగము:—ఇది యాఱువిధములు. వాత-పిత్త-శ్లేష్మ- సన్నిపాత- రక్త-సహజములని. ఇది గుదముతో చేరిన ముడుతెలందుండును. ఇవి చర్మ మాంస మేదస్సుల చెడగొట్టి అపానమున మొలకలను బుట్టించును. వగరు-కారము-జేదుగల వస్తువులను- కాక- చలవ- తేలికయగు వస్తువుల తినుటచేతను- స్వల్పాహారముచేతను- అతికాల భోజనమువలనను-తీక్ష్ణ మద్యపానముచేతను- అమిత మైధునముచేతను - ఉష్ణదేశమున ఉష్ణకాలమున లంకణముచేయుటచేతను - మంచులో నడచుటవలనను- దుఃఖము- ఎండ- గాలి వీని తాకుడులచేతను- వాతార్శముల గలిగించును. కారము - పులుసు-ఉప్పు- వేడిమి- నడక- నిప్పు- సెగ- ఎండసెగ- యెడతెగనికోపము - మద్యపానము- విశేషముగ నౌషధములఁబుచ్చుకొనుట-పైత్యవస్తుభక్షణము- అసూయ వీనిచే పిత్తార్శము లుద్భవించును. తీపై చమురుగలిగి చల్లని శీతలములగలుగ జేయువస్తువులను-ఉప్పుగ పుల్లగనుండు నఱుగని వస్తువులఁదినుట- అధికముగ నడచుట - పగటిపూట నిద్రించుట- ఎప్పుడును కూర్చొనియుండుట - దేశకాలముల విచారింపక ప్రవర్తించుట వీనిచేత శ్లేష్మార్శములబుట్టించును. హేతులక్షణ సంసర్గము - ద్వంద్వాతిశయము వీనిచేఁ గడమవి పుట్టును.

హిక్కా (ఎక్కిళ్లు) రోగము:—ఇవి యైదువిధములు. అన్న - యమళ- క్షుద్ర-గంభీర-మహా హిక్కలనియును యివియన్నియు కఫముతో ననుసరించియుండు వాయువుచె గలుగును. అధికపానముచేఁగాని - యధిక భోజనముచేతఁగాని వాయువు పీడింపఁబడి పైకివ్యాపించి యెక్కిళ్ళు వచ్చినయెడల అన్నజ మనంబడును. కొంచె మాలస్యముగ తలను గొంతును కదలించుచు జంటజంటగా వచ్చెడిది యమళము. ఆలస్యముగావచ్చుచు మంద

వేగంబున కంఠసంధి సమీపమునుండి బయలుదేరి వ్యాపించి వచ్చునట్టి ఎక్కిళ్లకు క్షుద్రమందురు. బొడ్డుదగ్గరనుండిబయలు భయంకరమై గంభీరమగు గొప్పధ్వనిగలదై దప్పి జ్వరములతో గూడియుండును. యిది గంభీరము. పొత్తికడుపు-ఎదరొమ్ము తల వీనిని బీడింపుచు నెడతెగక హిక్క వచ్చునేని నది మహా హిక్క యనంబడును. యిది దేహమునంతటికి వణకించును.

ఊరుస్తంభరోగము:—వాయువు దేహమునందు నొకనెలవఅకుజీర్ణించి యుండినయెడల నది తొడలకుదిగి ఎముకలనుబూరించి తొడల కదలకుండ జేయును. అపుడు తొడలు చలువలు క్రమ్మి స్పర్శ జ్ఞానముండదు. తొడస్వాధీనముండదు. దేహమంతటనొప్పులు-తొందర- నాతి- అరుచి- జ్వరముగల మనుజుడు పాదములు నొప్పులు- కష్టపడి లేచుట- కూర్చుండుట యీ గుణంబులం గలిగియుండును. దీనిని వాతరోగమని భ్రమింతురుగాని యిది ప్రత్యేకమైన వ్యాధి.

---

## 4. దొండ.

ఇది దొండ-తియ్యదొండ-ఆరుదొండ-లింగదొండ-కాకిదొండ యని యైదువిధములు.

నిఘంటువు:—బింబి-రక్తఫల - గోళ-తుండి- దంతచ్ఛదోపమ-మధుపక్వ-మహాదాళి-శ్లేష్మకృత్-బోధనాశిని యివి దొండపేళ్లు.

మధుతుండి- రక్తఫల- తుండికేరిఫల- ఓష్ఠోపదుఫల-దీర్ఘ-పీలుపర్ణి - తుండిక- చర్దిణి- తిత్తిరిఫల - కాంచననామిక యివి తియ్యదొండ పేళ్ళు.

ఆర్జట-ఆర్తగళ-బహుకంటక-ప్రఘర్షణ యివి ఆరుదొండ పేళ్ళు.

లింగిని-బహుపత్రి- ఈశ్వరీ- శైవవల్లరి- స్వయంభు- లింగసంభూత-లైంగ- తిఫలాన్విత- చండ- లింగ- గజ-దేవి-అయస్తంభిని యివి లింగదొండ పేళ్ళు.



కాకనాసా-ధ్వాంక్షనాస- కాకమండూకపర్ణిక- మురంగి-రక్తఫల-తుండికేశి యివి కాకిదొండ పేళ్ళు.

### గుణోపయోగములు.

దొండ వమనము చేయించును. రక్తపిత్తము- రక్తదోషము-కామిల వీనిని బోగొట్టును. యిది చలువచేయును. రుచిగ నుండును. గురుత్వపఱచును. పిత్తరక్తము-తాపమును బోగొట్టును. వీర్యస్తంభనము చేయును. లేఖనకారి-వాత మలబద్ధములను - కడుపుబ్బరమును గలిగించును.

తియ్యదొండ వాంతిని జేయును. కఫ - పిత్త-రక్తదోషముల-వాపును- పాండువును- క్షయమును హరించును. దీని ఫలము గురుత్వము చేయును. చనుబాలను వృద్ధిపఱచును. శ్వాసకాసవాతములం బోగొట్టును.

ఆరుదొండ వెగటుగ శీతలముగ నుండి వ్రణముల శోధించి మాన్పును.

లింగదొండ కారముగ-నుష్ణముగ-దియ్యగ-దుర్వాసనకలదిగ బలకారిగా నుండును. సర్వసిద్ధులనొసంగును. నాలుకను శోధించును.

కాకిదొండ మిక్కిలి యుష్ణముగం జేదుగ నుండును. కఫము-మూలరోగముల హరించును.

### రోగ నిదానము.

రక్తపిత్తరోగము:—ఈ రోగముగలవారికి ముక్కు-కనులు-చెవులు-నోరు- లింగము- యోని- గుదము వీనినుండి నెత్తురుపడును. దేహము చిక్కును. చలిమిరిని గోరును. గొంతున బొగవచ్చినట్లుండును. వాతి యగును. నోరు యినుపతుప్పు వాసనయుండును. నిట్టూర్పులు వచ్చును. యిది పైకి వచ్చునపుడు కఫముతోను దిగువకు వచ్చునపుడు వాయువుతోను గలిసి వచ్చును. రెండుమార్గములనువచ్చుచో కఫవాతములు రెండిటిచేవచ్చును.

క్షయరోగము:—అతిమైథునము-వేగనిగ్రహము - విషమభోజనము-అధికమైన యేడ్పు - సంతాపము వీనిచే వాతపిత్తశ్లేష్మములు

ప్రకోపించి దేహక్షయకరంబగు క్షయమునుగలిగించును. దేహమున నొప్పులు, జ్వరము, తాపము, మూర్ఛ వీనింబొందును.

---

## 5. చంద్ర.

ఇది చంద్ర, తెల్లచంద్ర, నల్లచంద్ర యని మూడు విధములు.

నిఘంటువు:—ఖదిర-రక్తసార-గాయత్రి-దంతదాపన- కంటకి- బాలపత్ర-జిహ్మశల్య - క్షితిక్షమతి-క్తసార-సుసార- ద్రుప- యూపద్రుమ-బహుశల్య-యాజక-కుష్ఠసూదన యివి చంద్ర పేళ్లు.

ఖదిర- శ్వేతసార- సోమవల్క- పథిద్రుమ- శ్యామసార-నేమివృక్ష-కార్ముక-కుబ్జకంటక-కాంభోజ - పత్రవృక్ష-విటప-మరుద్రుమ-మహాసార- కాలస్కంధ యివి తెల్లచంద్ర పేళ్లు.

కృష్ణసార-కాంభోజి- కాలక- గోరటు- మరుజ- పత్రతరు-బహుసార-సారఖదిర-మహాసార యివి నల్లచంద్ర పేళ్ళు.

### గుణోపయోగములు.

చంద్ర శీతలముగ, పండ్లకు హితమైనదిగనుండును. నులిపురుగులు, మేహము, జ్వరము, వ్రణములు, శ్వేతకుష్ఠు, వాపు, ఆమవాతము, పిత్తము, రక్తదోషము, పాండువు, కుష్ఠువు, కఫము, ముఖరోగము వీనిని హరించును దీనిబంక మధురముగ, బలకారిగ, శుక్రవర్ధనియై యుండును.

తెల్లచంద్ర వగరై పిత్తము, కఫము, రక్తదోషము, దురద, కుష్టముల బోగొట్టును.

నల్లచంద్ర ఉష్ణముగ చేదుగనుండును. రక్తవ్రణదోషములు, విషము, విసర్పము జ్వరము, కుష్ఠువు, ఉన్మాదము, భూతబాధ వీనిని దొలంగించును.

### రోగనిదానము.

ఉన్మాదరోగము:—ఉదరరోగములుపైకివచ్చి మనస్సునంటి మదము గలవానిం జేయురోగమునకు నున్మాదమని పేరు. ఇది యారువిధములు. వృద్ధినందనివేళ మదమనంబడును. బుద్ధిభ్రమయును,



బలము కదలును. చూపు చింతతోఁగూడినదగును. ధైర్యము లేకుండును. అసందర్భవచనప్రలాపముండును. ఎట్టి తలంపును లేకుండును. జ్ఞాపకశక్తి తక్కువగుటచేత నిది కలుగును. కారణములేక నవ్వుట, ఏడ్చుట, సంగీతము పాడుట, నటించుట యివియుండును. శరీరమెఱుపై జీర్ణశక్తిగలిగియుండునది వాతోన్మాదము. కోపము, గుడ్డలులేక తిరుగుట, బెదరించుట, పారిపోవుట, దేహమున వేడిమి, చల్లనివస్తువుల గోరుట, దేహము పసపువర్ణమగుట, పైత్యోన్మాదము. మాట్లాడకుండుట, చేష్టలు చేయకుండుట, మందము, అరుచి, స్త్రీల కెదురు రాకుండుట, అధికనిద్ర, వాంతి, జొల్లు, గోళ్లు తెల్లబడుట, తినినవెనుకబలము కలుగుట యివికఫోన్మాదలక్షణములు. మనుజులమాటలమాటలాడక తత్త్వజ్ఞానంబుల జెప్పుచు తిథివారపర్వ నియమములు లేకయుండునది భూలోన్మాదము. ఆచారముగలవాడై మాల్యంబుల ధరించి సంస్కృతము మాటలాడుచు వేదపఠనముచేయుచుండిన దేవగ్రహావేశి. చెమటలు పట్టుచు, గుళ్లుగోపురముల దిట్టుచు, కుటిలనేత్రములు గలిగి నిర్భయుడై దిగువజూచుచు, మిక్కిలి తిండిని దినుచుండిన రాక్షసగ్రహావేశి. ఏటి యిసుకదిన్నెలమీద, తోటలందునాశక్తిగలవాడై, సదాచారవంతుడై, గాననాట్యదురీణుడై, తిన్నగా నవ్వుచుండువాడుగంధర్వగ్రహావేశి. సన్నని యెఱ్ఱలు గుడ్డలఁగట్టుకొనుచు నెఱ్ఱని కనులు మితవాక్కులుగలిగి యేమడిగిన నిచ్చెదనని చెప్పవాడు యక్షగ్రహావేశుఁడు. విస్తళ్లను, దర్భలను, జనిపోయినవారికి పిండములు పెట్టుచు, జలతర్పణముచేయుచు, శాంతస్వరూపుడై వస్త్రము నపసవ్యముగా నుంచుకొని మాంసమును గోరుచు, నువ్వులు, బెల్లము, పాయసమును దినువాడు పితృగ్రహావేశి. భూమియందుబడి బొమ్మతో పాకుచు - నాలుకతో చెలివలనాకుచు-క్రోధాతిశయము గలిగి బెల్లము- తేనె - పాయసంబున నిచ్ఛగలవాడు నాగగ్రహావేశి. మాంసరక్తమద్యముల గోరుచు-లజ్జవదలికఠినముగ మాట్లాడువాడును- అతిశూరుడును- క్రోధ

స్వభావియు- బలశాలియు- రాత్రించరుడు- ననాచారి- ఆచార ద్వేషియగువాడు రాక్షస గ్రహావేశి. చేతులు పైకెత్తుచు- దేహము కృశించి మాటి మాటికి బ్రలాపించుచుండువాడు పిశాచగ్రస్తుడు. దేవగ్రహము పౌర్ణమిని- అసురగ్రహము సంధ్యలందు- గంధర్వగ్రహ మష్టమిని- యక్షగ్రహము ప్రతి పత్తులను- పితృగ్రహము అమావాస్యను - సర్వ గ్రహములు పంచమిని- రాక్షస గ్రహములర్ధరాత్రిని- పిశాచులు చతుర్దశిని బట్టును. మనుజులకు శీతోష్ణములు గలిగినట్లును - దేహఛాయ యద్దమున జొచ్చినట్లును- సూర్యకాంతమున సూర్యకిరణములు దూరినట్లును- గ్రహములు దేహంబును బ్రవేశించుటచే మన కనులకు దెలియబడవు.

## 6. సదాప.

ఇది సదాప - అడవిసదాపయని రెండు విధములు.

నిఘంటువు:—శతపుష్ప- మిసి- ఘోష-పోతకి- మాధవి- శతి- అహిచ్ఛత్ర- అహిపుష్పి- శతాహ్వా- కారవి- శఫ- పత్రిక- సంహతచ్ఛత్ర - వజ్రపుష్పి - లత - గురూషిక - అతిచ్ఛత్ర - శేతిక- మాగధి-వర- కరభి- గణిక- పత్రి- బ్రహ్మత్వక్పతి- వాక్పతి ఇవి సదాప పేళ్లు.

మైత్రేయ- తాళపత్రి- శతపర్ణి- మిసి- శైలేయ - శాలీన- సిత-శివా యివి అడవిసదాప పేళ్ళు.

### గుణోప యోగములు.

సదాప కారముగ- చేదుగ- స్నిగ్ధముగ- ఉష్ణముగ నుండును. శ్లేష్మము- వాతము- జ్వరము- నేత్రరోగము- వ్రణములహరించి వస్తికర్మ కుపయోగించును.

అడవిసదాప రుచికరముగ శీతలముగ నుండును. క్షయము- వాతము- పిత్తము- త్రిదోషములు- గాయములు వీనిని నశింపజేసి వీర్యవృద్ధి నిచ్చును.



## 8. కొడిసె.

ఇది కొడిసె, కొడిసెపాలయని రెండు విధములు.

నిఘంటువు:—కుటజ- గిరిజ-తిక్త- వత్సక-గిరిమల్లిక- కలింగ-మల్లికాపుష్పి-ఇక్షువృక్ష- వృక్షక-త్వచక- వరతిక్త-కౌటజ-పాండురద్రుమ యివి కొడిసె పేళ్ళు.

ఇంద్రయవ- కాళింద-కౌటజ-శక్రాహ్వా-పురుహూత-భద్రయవ యివి కొడిసెపాల పేళ్ళు.

### గుణోపయోగములు.

కొడిసె కారముగ, చేదుగ, వగరుగ, ఉష్ణముగ, శీతలముగ నుండును. పిత్తము, రక్తదోషము, దప్పి, అతిసారము, మూలశంకల నివర్తించును.

కొడిసెపాల త్రిదోషములను పోగొట్టి మలమును బంధించును. చలువజేయును. కారముగ నుండును. అతిసారము, రక్తమూలము, నులిపురుగులు, విసర్పము, కుష్ఠువులను బోగొట్టును.

## 8. మనుబాల. (పాలకూర.)

నిఘంటువు:—జీవంతి-జీవనీయ-జీవని- జీవవర్ధని-మాంగల్య-శాకశ్రేష్ఠ పయస్విని-జీవపుష్ప- జీవన- జీవభద్ర- యశస్కరి- శృంగారిటి- శాంకరి-పుండ్రభద్ర-సుమంగిలి యివి మనుబాల పేళ్లు.

### గుణోపయోగములు.

మనుబాల శీతలముగ, మధురముగ, జిగటగ నుండును. త్రిదోషములు, క్షయము, తాపము, జ్వరము వీనిని బోగొట్టి బలమును, పుష్టిని, కనులకు మేలును యిచ్చును. మలశోధకము చేయును. కఫ వీర్యముల వృద్ధిపఱచును.

# మాండూక్య ముని.

ఇతనిచేఁ జెప్పఁబడిన 1-ఆరె, 2-ఉసిరిక, 3-కాకర, 4-చింత, 5-ముత్తవపులగము, 6-పొట్ల, 7-తేలుమణి, 8-ములక.

### వీనికి జేయవలసిన శాపనివర్తిక్రమము.

శుభలగ్నమందు వీనికడకేగి ఊదువత్తినిగాల్చి యుంచుకొని తూర్పు ముఖంబుగాఁ గూర్చుండి యీ దిగువ యంత్రమును వ్రాసి తొమ్మిదిమారు లీ దిగువ వ్రాసిన మంత్రమును జపముఁ చేసినయెడల శాప నివర్తియగును.

### వశ్య యంత్రము.




మంత్రము:—ఓం రీం హ్రైం క్లీం ఔం సాం శరవణభవ.

## 1. ఆరె.

ఇందు ఆరెయని వేఱొక యారెయని రెండు విధములు. ఆరె పువ్వును యిందు జేర్పించెదను.

నిఘంటువు:—అశ్మంతక- చంద్రక- కుశల- తామ్రపత్రిక- శ్లక్ష్ణత్వక్- వాలుకాపర్ణ- యమళపత్రక- శఫరి-గద- పాషాణాంతక యివి ఆరె పేళ్ళు.

ప్రలంబచ్ఛదన- లక్ష్మీకర- కరాళిని యివి వేఱొక యారె పేళ్ళు.

ధాతకి-కుంజర- సింధుపుష్పి- ప్రమదిని- మద-పార్వతీయ- తామ్రపుష్పి-సుభిక్ష- మేఘవాసిని యివి ఆరెపువ్వు పేళ్ళు.



### గుణోప యోగములు.

ఆరె వగరుగ, మలబద్ధకారిగ, శీతోష్ణముగ నుండును. కఫ వాతము, గండమాల, రక్తదోషము, గళగండము, కంఠరోగము వీనిని బోగొట్టును. ఆరెపండు లేఖనము, మలబద్ధకము, గురుత్వమును గలుగంజేయును. శ్లేష్మవాతముల హరించును. ఇంకొకయారె వగ రుగనుండి శ్లేష్మము, కాసములు- పిత్తము- వ్రణములు- శూల- కర్ణ మూలముల నివర్తించును ఆరెపువ్వు కారముగ శీతలంబుగనుండును. కొంచెము కాకచేయును. వగరుగ లఘువుగ నుండును. దప్పి-అతి సారము- పిత్తము- రక్తదోషము- విషము - క్రిములు - విసర్పముల హరించును.

### రోగలక్షణము.

గళగండరోగము:—గొంతుక్రింద వాచినపుడు వైద్యముచేయక యలక్ష్యపఱచినయెడల వృషణములు వ్రేలాడును. అది గొప్పది గనో కొద్దిదిగనోయుండును. అది గళగండ మనంబడును. గళగండము నల్లనినరములతో గట్టబడి కపిలవర్ణముగనో యెఱుపుగనో కఠినముగనుండి పెద్దదై పండకుండును. కారణము తెలియకనే పరిపక్వమగును. నోటియందరుచి- దవడలు గొంతు లోపల నెండినట్లుండుట- దురదగ- చల్లగ నుండును.

గండమాలరోగము:—చిన్న రేగు - గంగ రేగుపండ్లంతయు - ఉసిరికంతయు- చంకలందు భుజముల సందులను- కంఠమునను- గజ్జలందును కణుతులవలె మొలచును. ఒకటిగనుండిన గళగండ మనంబడును. అనేకములు పుట్టిన గండమాల.

---

## 2. ఉసిరిక.

నిఘంటువు :—వయస్త- ఆమలక-వృష్య- ధాత్రి- ఫలరస-శివ- ధాత్రీఫల- శ్రీఫల- అమృతఫల- ఆమలకి- శీతఫలి - శీతామృతఫల.

### గుణోపయోగములు.

కారముగ- చిరుచేదుగ- వగరుగ- పుల్లగ- రుచికరముగ- శీతలముగ- లఘువుగ నుండును. త్రిదోషములు- కఫము- జ్వరము వీనిని

హరించి వీర్యవృద్ధికరముగ కేశవృద్ధికరముగనుండును. కరక్కాయతో సమమైన గుణముకలది. రక్తపిత్తమును బోగొట్టును. శుక్రమును వృద్ధిచేయును. పుల్లగ నుండుటచే వాతమును - తియ్యగ శీతలముగ నుండుటచే పిత్తమును- రూక్షగ వగరుగ నుండుటచే కఫమును హరించును.

---

## 3. కాకర.

ఇది కాకర- పెద్దకాకర- ఆగాకర- గొడ్డాగాకర- బుడ్డకాకర యని యైదువిధములు.

నిఘంటువు:—కారవేల్లము- కటిల్లము- ఉగ్రకాండము- సకాండము యివి కాకరపేళ్లు. కారవల్లి-వారివల్లి-బృహద్వల్లి యివి పెద్ద కాకర పేళ్లు. మహాజాలి- ఫలవభి- పీతపుష్పి - కర్కోటకి- విషఘ్ని-కంటకి-నళిని-నళి- యివి ఆగాకర పేళ్లు. వంధ్యా కర్కోటకీ- దేవి- మనోజ్ఞ- కుమారిక- నాగారి- నాగామథని విషకంటకిని, మజ్జమదని, కన్యాభూతప్రదర్శిని, వంధ్య, పాద, ప్రజ, యోగీశ్వరి యివి గొడ్డాగాకర పేళ్ళు. అనంత, సూక్ష్మ మూల, ఖముల, వల్లికాప్రియ యివి బుడ్డకాకర పేళ్ళు.

### గుణోపయోగములు.

కాకర చలువ చేయును. త్రిదోషముల భేదించును. చులకన నిచ్చును. వాతమును జేయదు. ఇది పిత్తరక్తము, కామిల, పాండువు, కఫము, మేహము, క్రిములను నశింపజేయును. అడవి కాకరకాయ కాకచేయును. దోషముల విషముల హరించును. నోట నీరూరును. శ్వాసము, కాసము, మూలశంక, క్రిములు, కుష్ఠువు, వ్రణములహరించును. ఆగాకరపువ్వులు, కుష్ఠువు, అరుచిని బోగొట్టును. ఆగాకరహృదయమునకు మేలుచేయును. వగరుగం దీపుగ నుండును. గురుత్వము జేయును. అగ్నిదీపనమును గలిగించును. త్రిదోష ప్రకోపమును బోంగొట్టును. గొడ్డు ఆగాకర చేదుగా కారముగనుండి కాక చేయును. చులకన బలకరముగనుండి శోధించును. గ్రహపీడ, విషము, శ్లేష్మము



నేత్రరోగము, శిరోరోగము, వ్రణము, విసర్పము కాసము, భగందరము, రక్తదోషము, వంధ్యాత్వముపోవును. బుడ్డకాకర వెగటుగ జిగటగ నుండును. గురుత్వము చలువయును గలిగించును. రక్తపిత్తము, మూత్రదోషముల హరించును. ఇది కామిలాయందుపయోగమై వ్రణముల మాన్పును.

### రోగ లక్షణము.

భగందరరోగము:—గుదప్రదేశమునను దాని కంగుళమెడముగల తావున నిరుప్రక్కలందుంగాని పిడకమువలె బాధించుచు భేదమును గలిగించునట్టిది భగందరము. శతఫేనకము, ఉష్ట్రగ్రీవము పరిస్రావి, శంబూకావర్తము, ఆగంతుకమని యైదువిధములు. శతఫేనకము వాయువుచేం బుట్టునది. ఇది జల్లెడతూట్లవంటి తూట్లను గలిగి జల్లెడవలె పిడకము కలుగును. వీనిని క్రొత్తలోనే చికిత్స చేయక యుపేక్షచేసినయెడల పెద్దవై నూరు బొందలు గలిగి మూత్రపురీషములు, రేతస్సు, చీము, నెత్తురు కారుచుండును. ఇది వాతమువలన బుట్టును. ఉష్ట్రగ్రీవము మొదట నెఱ్ఱని కదుము గలిగి శీఘ్రముగా పక్వమై చల్లని దుర్గంధమగు రసి కారుచుండును. ఇది పిత్తముచేం బుట్టును. పరిస్రావి తెల్లని వర్ణముకలిగి రసి స్రవించును. దురద గలిగి కఠినమై కొంచెము వేదన గలదియగు. ఇది కఫమువలనంబుట్టినది. శంబూకావర్త మనేకవర్ణములు గలిగి బాధతోం గూడి స్రవింపుచు నావుచన్నువంటిరూపముగలిగి నత్తగుల్లవంటి సుడి గలిగిన నరముల తిరుగుటగలిగియుండును. ఆగంతుకము ముల్లు మొదలైనవానిచేం జీలుకొని పోయివుండు పడినదానిని జికిత్స చేయక యలక్ష్యము చేయుటచే, పురుగులు పుట్టి యనేకమార్గములుచేసి వ్రణమును వృద్ధిపఱచును.

---

## 4. చింత.

ఇందు చింతాకును చింతపండును జెప్పబడును.

నిఘంటువు:—వృక్షామ్లము- తింత్రిణీకము- శాకామ్లము- రక్తపూరకము, అమ్లవృక్షము, అమ్లశాకము అమ్లపూర్ణము- మహీతరు, రక్తచూడ, రసామ్లము, వరామ్లము, ఫలామ్లకము-మహీరుహం, చించవృక్షము, అమ్లక, చించ, ఫలద్రుమం యివి చింతపేళ్ళు.

తింతిడీకము, వృక్షామ్లము, అమ్లశాకము, అమ్లపాదపము యివి చింతపండు పేళ్ళు.

గుణోపయోగములు.

చింత రుచికరముగనుండును. వాంతి, పిత్తము, క్రిమిరోగము, హృద్రోగము, గుల్మము, శ్లేష్మము, వాతము వీనిని నివరించి యగ్ని దీపనమును గలిగించును. జఠరాగ్ని, ప్రొత్తికడుపు వీనిని శుద్ధిచేయును. చింత వగరు చులకనగ నుండును. శ్రమ, భ్రమము, దప్పి బడలిక వీనిని నివర్తింపజేయును. చింతచిగురు వగరుగ, పుల్లగ, రుచికరముగ నుండును, నేత్రరోగము, కఫము, వాతము వీనిని బోగొట్టి యగ్ని దీపనమును గలిగించును. చింతపువ్వులు వగరుగ, తియ్యగ, పుల్లగ, రుచికరముగ, శోధనకారిగనుండును. చింతాకు వాపురక్తదోషమును హరించును. చింతపూలభస్మము, పట్టభస్మము యివి శూల, యగ్ని మాంద్యముల బోగొట్టును. చింతాకురసము వేగవంతము. అమ్లవాతమును హరించును. చింతాకురసమును చక్కెరతో సేవించినయెడల తాపము, పిత్తము, బడలికలందీర్చును. చింతపండు వాతమును బోగొట్టును. చింతగుల్ల మిగుల నుష్ణముగ గురుత్వముగనుండును. వండిన చింతగుల్ల లఘువుగ మలబద్ధకారిగ నుండును. గ్రహణీ, కఫము, వాతముల హరించును.

## 5. ముత్తవపులగము.

ఇది ముత్తవపులగము, పెద్దముత్తవపులగము, జిబిలిక, బలుసు అని నాలుగువిధములు.

నిఘంటువు:—బల- అతిబల- వాట్యపుష్పి- వికంకత- రుష్యప్రోక్త- రుమగంధ- భూతిఫల- వాట్యాయని- భరద్వాజి- సుపర్ణిక-



భద్రౌదని-సమంగ- కచ్చుర- కంటకి- మహాసహా- శీతపూరక- సహా యివి ముత్తవపులగము పేళ్ళు.

బల-భద్రౌదిని-వాటి-సమంగ- ఖరయష్టిక-మహాసమంగ- ఓదనిక-శీతపాకి-ఓదన-శీతవార- వాతఘ్ని- విజల- జలకేళిక- వాల్యాయని-ప్రభార్య-నిష్టి-వాట్యాలక-మహాబల-వర్షపుష్పి- వాద్యాలక-సహ దేవ-దేతసహా- పీతపుష్పి- బృహద్బల- గంధవల్లి-మహాగంధ-మంగల్య-ఆర్తప్రసాదిని యివి పెద్దముత్తవపులగము పేళ్ళు.

గాంగేరుకి-నాగబల-సరగంధినిక-విశ్వేదేవ-అరిష్ట- ఘంటస్వాంగవేధుగ- దేవదండ-ఉత్పల- కాల- మంగల్య-అర్ధప్రసాదని-పర్షపుష్పి-మహాకంధ-గోరక్షతండులా ఇవి జిబిలిక పేళ్లు.

బలాక-అతిబల-భారవాజ- వృక్షగంధిని ఇవి బలుసుపేళ్ళు.

గుణోపయోగములు.

ఈ నాలుగును శీతలముగ, మధురముగ, జిగటగనుండి మలబద్ధకారియగును. శరీరమునకు బలమును కాంతిని గలిగించును. వాతరక్తము, పిత్తరక్తము, గాయములను నశింపజేయును. పెద్దముత్తవపులగము మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. వాతమున కనులోమగమనమును బుట్టించును. జిబిలిక గురుత్వము చేయును. వీర్యమును వృద్ధిచేయును. రక్తపిత్తమును హరించును. బలము నిచ్చును. ఆయురారోగ్యములు పుంసత్వమును వృద్ధిపఱచును. శరీరమునకుపుష్టినిచ్చును ముత్తవపులగపుపండ్లు శీతలముగ రుచిగా నుండును. ఇది శరీరస్తంభనము, గురుత్వము, లేఖనము, మలబద్ధములను గలుగంజేసి రక్తపిత్తమును వృద్ధిపఱచును.

## 6. పొట్ల.

ఇది పొట్ల చేదుపొట్లయని రెండు విధములు.

నిఘంటువు:—పటోల- పాండుక- జాతి-కలశ-కర్కశచ్ఛద-రాజీఫల- పాండుఫల- రాజీమాన- అమృతాఫల యివి పొట్ల పేళ్ళు.

తిక్తోత్తమ- బీజగర్భ- రాజపటోలిక- జ్యోత్ని- పటోలిక
జాలి- నాదేయి- భూమిజంబుక యివి చేదుపొట్ల పేళ్ళు.

గుణోపయోగములు.

పొట్ల వండిన యొమ్మునకు మేలును, వీర్యవృద్ధిని, అగ్నిదీపనమును చేసి చులకనగ నుండును. ఇది జిగటగ నుష్ణముగ నుండును. వాతరక్తమును, జ్వరము, త్రిదోషప్రకోపము, క్రిములనడంచును. పొట్ల వేరు పిత్తకఫములపోగొట్టి విరేచనము చేయించును. పథ్యకారి. పొట్లాకు పిత్తమును బోగొట్టును. చలువచేయును. రుచికరముగ నుండును. త్రిదోషము, క్రిములు, జ్వరము వీనిని బోగొట్టును. పొట్లతీగ కఫమును బోగొట్టును. పొట్లకాయ మధురముగ రుచిగ నుండును. ఇది త్రిదోషములు, అరుచి, కామిల, కష్టు, మేహము, జ్వరము, నేత్రరోగము, పాండువు, వ్రణము, అగ్నిమాంద్యము, వాపు, క్రిములు వీనిని నశింపజేయును. పొట్లపండు కారముగ చేదుగ నుండును. పండినయెడల రుచికరముగ చులకనగ నుండును. అగ్నిదీపనము వీర్యవృద్ధిని గలిగించును. మలమును వెలిచేయును. వాతపిత్త శ్లేష్మములస్థిరపఱచును. సారముగలది. శ్వాసము, జ్వరము, త్రిదోషప్రకోపము, క్రిములను హరించును. చేదుపొట్ల కారముగ సారముకలదిగనుండి కాకచేయును. వగరుగ నుండును. అగ్నిదీపనము కలిగించును. పిత్తము, శ్లేష్మము, దురద, కుష్ఠువు, రక్తవికారము, జ్వరము, తాపము, దప్పి, కోష్ఠరోగము, క్రిములు నివర్తియగును.

## 7. తేలుమణి.

ఇది రెండు విధములు.

నిఘంటువు:—శణపుష్పి, బృహత్పుష్పి, పైవోక్త, శణఘంటిక, మహాశణా, మాల్యపుష్ప, వామని, కటుతిక్తక, నక్ర, అహిదంష్ట్రి, కాకోళి, వృశ్చిక, వ్యాళఘూమిక, ధూమపత్ర, విశల్యా, విషఘ్ని, నేత్రరోగహ, విషాణి, దక్షిణావర్త, దేవలాంగూలిక యివి తేలుమణి పేళ్ళు.



దక్షిణావర్త, వృశ్చికాళి, విషాణిక, సమర, వృశ్చిపత్రి, నగవృశ్చిక, బదని, మేఘపుష్పి, ఫురపుష్పిక యివి రెండవ తేలుమణి పేళ్ళు.

గుణోపయోగములు.

తేలుమణిచెట్టు వగరుగనుండును. ఇది కఫము, పిత్తము, రక్తస్రావము వీనిని నివర్తింపఁజేసి వీర్యవృద్ధికరముగ నుండును. ఇది వమనకారి. దీని విత్తులు గర్భస్రావమును గలిగించును.

## 8. ములక.

ఇది పెద్దములక తెల్లములకయని రెండు విధములు.

నిఘంటువు:—బృహతి- సింహిక- క్రాంత- వార్తాకి- రాష్ట్రికాకులి- వికద- స్థూలవార్తాకి- మహతి- మహోటిక- సర్పతను- క్షువధూ పితతండుల-రోదని-బహుపత్ర-విధావక యివి పెద్దములక పేళ్ళు.

కాసఘ్ని- క్షుద్రమాత- వార్తాకిని- కటవార్తాకిని- క్లిన్ని- అటహి- అకపట- ఈశ్వరి- విన్న- శ్వేతఫల- భండారి- త్వక్స్పృశ్- గర్ధభ- చంద్రభ- చంద్ర- చలదపుష్ప- ప్రియంకరి- కుంజ- మూలనారి- కూటవార్తాకిని- లక్ష్మణ- క్షేత్రదూతి-సితసింహ- అమయద్విష- హింగులి- నాకులి - రాష్ట్రి- భిర్లదు- మహౌషధి యివి తెల్లములక పేళ్లు.

గుణోపయోగములు.

పెద్దములక కఫము, వాతము, శ్వాసము, శూల, జ్వరము, హృద్రోగము, మందాగ్ని, అగ్నిదోషంబులఁ బోగొట్టును. ములక కాయ ఉప్పగ, వెగటుగ, కారముగ, చులకనగ నుష్ణముగ నుండును. ఇది కఫవాతము, క్షయము, కాసము, గుల్మము, అర్శస్సు, ఉదరరోగము, వాపు వీనిని బోగొట్టును. ఇది అగ్నిదీపనమును జీర్ణమును గలిగించును. లేతకాయ త్రిదోషముల హరించును. దోరకాయ పిత్తమును, ములకపండు కఫమును వృద్ధిచేయును.

తెల్లములక వగరుగ, చేదుగ, నుష్ణముగ నుండును. శ్వాసము కాస, అరుచి, జ్వరము, వాతము, ఆమదోషము, హృద్రోగములహరిం

చును. గర్భమును ధరింపించును. రుచిని బుట్టించును. కాటుక వేసి కొనిన నేత్రరోగముల ఖండించును.



# నందీశ్వరుడు.

ఇతడు చెప్పిన 2-మేడి, 2-ఉత్తరేణి, 3-ఎలుకచెవి, 4-గలిజేరు, 5-పొన్న, 6-గొంతెమగొమరు, 7-బీర, 8-జెముడు.

వీనికి శాపనివర్తి క్రమము.

శుభలగ్నమున వీనికడ కేగి సాంబ్రాణివత్తిరగిలించిపెట్టి ఉత్తర ముఖముగాఁ గూర్చొని దిగువజూపిన యంత్రమున్వ్రాసి, యీదిగువ కనిన మంత్రమును తొమ్మిదిమారులు జపించునది.

మోహన యంత్రము.




మంత్రము:—హ్రైం క్లీంఔంసౌంఓంరీం వణభవశర పటుపటుస్వాహా

## 1. మేడి.

ఇది మేడి, బ్రహ్మమేడి, సీమమేడి, అగ్నిమేడియని నాలుగు విధములు. అగ్నిమేడి రెండు విధములగుటచే మొత్తము ఐదువిధము లయ్యెను.



నిఘంటువు:—ఉదుంబర, క్షీరవృక్షము, జంతువృక్షము, సదాఫలము- హేమదుగ్ధము- క్రిమిఫలము- యజ్ఞాంగము- శీతవల్కలము ఇవి మేడి పేళ్లు. కాకోదుంబరిక, ఫల్గు, మలాయు, శ్విత్రభేషజ, ఫల్గుణి, ఫలహారి, రాజఫల్గు, శివాటిక యివి బ్రహ్మమేడిపేళ్లు. అంజిరము, మజ్జలము, కాకోదుంబరికాఫలము యివి సీమమేడి పేళ్ళు. ఆవర్తకి, తిందుకిని, విభాండి, పీతకి, లత, చర్మరంగ- రక్తపుష్ప- వామావర్త- విషాణిక యివి అగ్నిమేడి పేళ్ళు. అజశృంగి- మేషశృంగి- సర్పదంష్ట్రా- వర్తికా- తిక్తదుగ్ధ- అక్షిభైషజ్యము-పుత్రశ్రేణి-విషాణిక, ఉష్ట్రరోమశపర్ణి, వివృక్షు ఘనశృంగకము- విషఘ్నము- పాదవృక్షము- కాలి- చెక్షుష్య యివి రెండవ అగ్నిమేడి పేళ్లు.

గుణోపయోగములు.

మేడి శీతలముగ నుండును. గురుత్వమును జేయును. వ్రణ ములు- కఫము- పిత్తము- రక్తదోషము వీనిని హరించును. మేడిపండు బాగుగ పండినయెడల మిక్కిలిచలువచేయును. పిత్తమునుబోఁగొట్టును. తియ్యగ నుండును. శ్రమ మేహము వీనిని బోఁగొట్టును. ముదిరిన మేడికాయి వగరుగ తియ్యగ రుచిగ నుండును. అన్నదీపనమును జేయును. శరీరమునకు మాంసవృద్ధిని జేయును. శ్రమను బోఁగొట్టును.

బ్రహ్మమేడి మేడివంటి గుణమును గలదే. అది విశేషముగ గాయము- కుష్టువు- దురద- వ్రణములు- రక్తపిత్తము-పాండువు-వాపు వీనిని హరించును. కఫము, పిత్తములను గలుగఁజేయును. మలమును గట్టిపరచును.

సీమమేడి (అంజీరుపండు) చలువచేయును. రుచిగ నుండును. గురుత్వము చేయును. పిత్తరక్తము వాతము వీనిని బోగొట్టును.

అగ్నిమేడి ఊర్ధ్వదోషము- కఫము- పిత్తము- విషము- శోఫ- గుల్మము- మహోదరము - కడుపుబ్బరోము - క్రిములు- మూలవ్యాధి వీనిని హరించును.

రెండవ యగ్నిమేడి రుచికరమైయుండి శీతజ్వరము - విషము-వాపు-వాతము-దప్పి-వాంతిని హరించును.

## 2. ఉత్తరేణి.

నిఘంటువు:—అపామార్గ- శిఖరి-ప్రత్యక్పుష్పి- మయూరక-అధశ్శల్య-కిణిహి-దుర్గ్రహ- ఖరమంజరి- శేఖరిక-మర్కటి-దూరవిగ్రహ ప్రత్యక్శ్రేణి- వక్రశిత- కూట- మర్కటిపిప్పలి - ధామార్గవ-ఘోంటాకు- కుబ్జక- స్థూలమంజరి యివి ఉత్తరేణి పేళ్ళు.

### గుణోపయోగములు.

ఉత్తరేణి కారముగను చేదుగనుండును. ఇది కఫము-సిధ్మము-మహోదరము- అర్శస్సు- వాపు - దురద - శూల - అరుచి వీనిని నివర్తింపజేయును. ఇది శీఘ్రముగ విరేచనమును గలిగించును.

## 3. ఎలుకచెవి.

నిఘంటువు:—ద్రవంతి- శంబరి- చిత్ర- న్యగ్రోధి- మూషికాహ్వయ-ప్రత్యక్శ్రేణి- విష- రండ- పత్రశ్రేణి- ఆఖుపర్ణిక- కృషిక-వృకపర్ణి- పత్రపంజి- అళిక- మాత- భూమిచర- జుంకపర్ణి యివి యెలుక చెవియాకు పేళ్ళు.

### గుణోపయోగములు.

ఎలుకచెవియాకు రుచికరముగ నుండును. ప్రమేహము- బహుమూత్రము- కఫము- పిత్తము-జ్వరము- పాండు- క్రిమిరోగము- కుష్ఠము-భగందరము వీనిని నివర్తించును. చిన్నయెలుకచెవియాకు కారముగ చేదుగ నుష్ణముగ శీతలముగ నుండును. ఆయురారోగ్యముల వృద్ధి చేయును. చులకనగ వగరుగ నుండును. కఫము- పిత్తము- శూల-జ్వరము- క్రిములు- గ్రంథులు - మూత్రకృచ్ఛ్రము- ప్రమేహము-కడుపుబ్బరము- ఉదరరోగము- హృద్రోగము-విషపాండువు-భగంధరము వీనిని హరించును. ఎలుకచెవియాకుకూర మధురముగ నుండును. బలము నిచ్చును. ప్రమేహము-బహుమూత్రము-కఫపిత్తము-వాతము-మలమూత్రనిరోధము వీనిని హరించును.



### రోగ లక్షణము.

ప్రమేహరోగము:—ఇది యిరువదివిధములు. చందనము లేక నీళ్లతో సమమైన మూత్రము వచ్చిన ఉదకమేహము. చెఱకురసము వలెను తీపుగను మూత్రమువచ్చిన ఇక్షుమేహము. ఈ మూత్రమునకు చీమలు మూగును. మూత్రమును పాత్రయందుంచి తెల్లవాఱిచూచినయెడల గడ్డకట్టియుండునేని సాంద్రమేహము. తాటికల్లువలె నురుగును వాసనయునుగల మూత్రము సురామేహము. ఇది పైకి తేటగా నుండును. లోపల గడ్డకట్టును. పిండిగలిసిన నీరువలె తెల్లగ విస్తారముగా మూత్రముండిన యెడల పిష్టమేహము. మూత్రము శుక్రముతో గలసి శుక్రవర్ణముగలిగియుండిన శుక్రమేహము. మూత్రముతో నిసుకరేణువులు పడినయెడల సికతామేహము. అధికముగ తీపుగ చల్లగ మూత్రము వెడలిన శీతమేహము. మందముగ కొంచెముగ మూత్రమువచ్చిన శనైర్మేహము. నురుగును గడ్డయు గలిగితంతువులతోగూడినమూత్రము వెలివడినలాలామేహము. క్షారోదకమువలె మూత్రము వచ్చిన క్షారమేహము. నీలమువలెనల్లగానుండిన నీలమేహము. పసపునీళ్లవలెనుండిన హారిద్రమేహము. దుర్గంధమును మాంజిష్ఠవర్ణముగనుండిన మాంజిష్ఠమేహము. దుర్గంధము ఉప్పుతోగూడి రక్తవర్ణముగల మూత్రము వదలిన రక్తమేహము. మాంసపునీరురంగు మూత్రము వదలిన వసామేహము. మెదడు వర్ణముండిన మజ్జామేహము. తీపుగ వేడిగ వగరుగ నుండిన మధుమేహము. ఏనుగువలె వేగములేక వచ్చిన హస్తిమేహము.

## 4. గలిజేరు.

ఇది తెల్లగలిజేరు-ఎఱ్ఱగలిజేరు-నల్లగలిజేరని మూడువిధములు.

నిఘంటువు:—పునర్నవ- శ్వేతమూల- పృథ్వీక- దీర్ఘపత్రక- విషాది దీర్ఘపర్ణాభు- పునర్భు- మండలచ్ఛద యివి తెల్లగలిజేరు పేళ్ళు.

తిక్త- రక్తపుష్ప- కటిల్లక- ఘూర్రక- క్షుద్రవర్షాభు- వర్ష కేతు- శివాటికా యివి యెఱ్ఱగలిజేరు పేళ్ళు.

నీల-శ్యామ-నీలపునర్నవ- కృష్ణనీలవర్షభు- నీలిని- భిదారిక యివి నల్లగలిజేరు పేళ్ళు.

గుణోపయోగములు.

తెల్లగలిజేరు చేదుగ నుండును. వేగముగలది. తాపమునిచ్చునది. కాకచేయును. వాపు-కఫము- వాతము- కాసము - మూలశంక- వ్రణములు- పాండువు- విషము- ఉదరరోగము-శూల- హృద్రోగము ఉరఃక్షతము వీనిని హరించును. దీని వేరును నేతిలోచాది కాటుక వేసిన కంటిపూవులు హరించును. తేనెలో చాది కాటుక వేసిన నీరు కారుట మానును. ఆకురసములో చాది కాటుక వేసిన కంటిదురద మానును. ఆవుపంచితము- పేడనీరు- పిప్పలి వీనిలో దేనితో నొక దానితో నూరి కాటుకవేసిన రేచీకటి మానును. ఆకురస ముష్ణము చేయును. కూర వెగటుగ చేదుగా నుండును. తాపము నిచ్చును. వాతము- కఫ - శ్వాసము- కాసము- ఉదరరోగము- విషపాండు- గుల్మము- క్షయము- అర్శస్సు- వాపులను నివర్తించును. అగ్నిదీపనము చేయును. విరేచనమగును.

ఎఱ్ఱగలీజేరు చేదుగనుండును. పాకముచేఁగారముగ శీతలముగ జులకనగ నుండును. వాతముచేయును. మలమును బంధించును. ఇది పాండువు- రక్తపిత్తము- వాపు-వ్రణములు- శ్లేష్మము వీనిని నశింపఁజేయును. రుచికరముగ ఆయురారోగ్యవృద్ధికారిగ నుండును.

నల్లగలిజేరు చేదుగ-కారముగ-నుష్ణముగ-బలకారిగనుండును. ఇది హృద్రోగము-పాండువు - వాపు - శ్వాసము - వాతము - కఫము వీనిని నశింపఁజేయును.

---

5. పొన్న.

ఇది ముయ్యాకుపొన్న కోలపొన్నయని రెండు విధములు.

నిఘంటువు:—సాలపర్ణి-స్థిర- సౌమ్య-త్రిపర్ణి-పంగుహా-ధ్రువ-విదారిగంధ-సుమతి-దీర్ఘమూల- సాతిని-సర్వానుకారిణి- తన్వీ-దీర్ఘపర్ణి- పర్ణిక- కుముద- అతిగ్రహ- శోషఘ్ని యివి ముయ్యాకుపొన్న పేళ్ళు.

పృశ్నిపర్ణి-పృథక్పర్ణి- కలశి- ధామని - గుహ- సృగాలవిన్న-లాంగూలి- కర్ణిక-క్రోష్టుపుచ్ఛిక-లాంగలి- చంద్రపర్ణి-దీర్ఘ-క్రోష్టుకపుచ్ఛిక-పూగావతి-సృగాల- కేసరిపుచ్ఛిక యివి కోలపొన్న పేళ్ళు.



గుణోపయోగములు.

ముయ్యాకుపొన్న వగరుగ, గురుత్వముగ, ఉష్ణముగనుండును. ఇది వాతదోషము, విషమజ్వరము- మేహము-శోఫ- వాంతి- అరుచి-జ్వరము- కాసము- ఆమదోషము- దప్పి- తాపములను హరించును.

కోలపొన్న స్వాదుగఁ జులకనగ నుష్ణముగ నుండును. ఇది త్రిదోషములు- శ్వాసము- కాసము- జ్వరము- దప్పి- తాపములను బోఁగొట్టును.

---

6. గోంతెమగోమరు.

నిఘంటువు:—ప్రసారిణి-సుప్రసర-సరణి- సారణి-చారుపర్ణి-రాజబల-భద్రపర్ణ-ప్రతారణి యివి గోంతెమగోమరు పేళ్ళు.

గుణోపయోగములు.

గోంతెమగోమరు గురువుగఁజేదుగ నుష్ణవీర్యముగలదిగనుండును. దీనిని సేవించినవారికిఁగల సమస్తవాతరోగములను హరించును.

---

7. బీర.

ఇది చేదుబీర పెద్దబీరయని రెండు విధములు. అందు పెద్దబీర పొట్టిబీర-నిడుపుబీర-నేతిబీరయని మూడువిధములుచేరి నైదువిధములయినవి.

నిఘంటువు:—కోశాతకి-కృతచ్ఛిద్రా-జాలిని- కృతవేతస- క్ష్వేళ- సుతిక్త-ఘోంటాలి-మృదంగఫలిని యివి చేదుబీర పేళ్ళు.

ధామార్గవ- కోశఫల- రాజకోశాతకి- కర్కోటకీ-సీతపుష్ప-
మహాజాలి- హస్తికోశాతకీ- విశాల-కర్కటిచ్ఛదా యివి పెద్ద
బీర పేళ్ళు.

గుణోపయోగములు.

చేదుబీర చేదుగ, వగరుగ, నుష్ణముగనుండును. ఇదిప్లీహము, పాండువు, అర్శలు, శూలము, కుష్ఠము, వాపు, కాసము, ఊర్ధ్వశ్వాసము, విసర్పములను నివర్తించును. దీనిపండు విరేకనకారి. శీతలముగ నుండును. మేహత్రిదోషములను హరించును. దీనివిత్తులు శిరోరోగమును బోగొట్టును.

చేదుబీర సమూలరసము చేదుగ,నుష్ణముగ,వగరుగనుండును. ఇది పాండు, విద్రధి, గుల్మము, మూలము, శ్వాసము, కాసము,విషము, సమస్తవాతములు, సన్నిపాతము, కుషము, వాపును హరించుచు వాంతిని గలుగఁజేయును.

పెద్దబీర వగరుగ నుండును. ఇది గుల్మము, మహోదరము, కఫము, దురద, కుష్ఠము, వాతము, క్రిమిరోగము, శోఫనుహరించును. పొట్టిబీర కఫపిత్తములఁ బోగొట్టును ఇది శుక్రమును వృద్ధిచేయును. కుష్ఠువు, మేహము, క్షయము, శ్వాసము, కాసము, అరుచి వీనిని హరించును. నిడుపుబీరకాయ విషమునుబోగొట్టును. తీపుగనుండును. శుక్రమును వృద్ధిచేయును. నేతిబీరకాయ రక్తపిత్తమును హరించును. రుచిగనుండును. శుక్రవృద్ధికరము. ఎక్కిళ్ళు, విషము, చలిజ్వరము నశించును.

---

8. జెముడు.

ఇది జెముడు - బొంతజెముడు - కోలజెముడు- ఆకుజెముడు అని నాలుగువిధములు.

నిఘంటువు:—స్నుక్ - స్నృధ- మహావృక్ష- మూఢ- నిస్యందపత్రక-
సమంతదుగ్ధ-దండీరి-సాహుండ- వజ్రకంటక-వజ్రవృక్ష-మహా
స్నావ-బహుక్షీరి-విషాణిక యివి జెముడు పేళ్ళు.



వజ్రతుండ- మహావృక్ష- గండీక- స్నుక్ - సుధ- స్నుహి-
వజ్రవృక్ష- బహుస్రావ- బహుక్షీర- వృషాణిక- యివి బొంత
జెముడు పేళ్లు.

సమంతదుగ్ధ-సింహుండ-వజ్ర-యామళకంటక యివి కోల
జెముడు పేళ్లు.

దళస్నుహి - శ్వానజిహ్వ - పత్రస్నుక్ - సువిరేచని ఆకు
జెముడు పేళ్లు.

గుణోపయోగములు.

జెముడు వగరుగ-గురుత్వముగ- ఉష్ణముగనుండును. కఫము-వాతము- ప్లీహము- మహోదరము- అర్శస్సు- గుల్మము- వ్రణము- శూలలు-పాండురోగము-వాపులను నివర్తించును. అగ్నిదీపనమును గలిగించును.

బొంతజెముడుపాలు దానిరసము చేదుగ-గురుత్వముగ-కారగనుండును. కఫము- వాపు-ప్లీహము- ఉదరరోగము-అర్శస్సు-గుల్మము వీనిని నాశము చేయును. వాతమును శోధించును. జెముడాకు రుచిగ కారముగ నుండును. అగ్నిదీపనమును గలిగించును. కుష్టువు-అష్ఠీల-వాతము- శూల- వాపు-ఉదరరోగములఁ బోగొట్టును. కోలజెముడు కారముగ- చేదుగ- నుష్ణముగ నుండును. తాపము నిచ్చును. అగ్నిదీప్తిని గలిగించును. వేగముకలదిగ నుండును. గురుత్వము చేయును. వాంతినిగలిగించును. కుష్టువు-ఉదరరోగము-ప్లీహము-వాతము-ప్రమేహము- శూల- ఆమము- కఫము- వాపు- గుల్మము- అష్ఠీలకవాతము- కడుపుబ్బరము-పాండువు-కఫోదరము- వ్రణము-జ్వరము-ఉన్మాదము- వాతము- మేదోరోగము- తేలువిషముల హరించును.

---

వ్యాఘ్రిపాణి.

ఇతడు చెప్పిన 1-అడ్డసరము, 2-కటుకరోహిణి, 3-తాడి, తీటకసివెంద, 5-సుగంధపాల, 6-దూలగోవిల, 7-నీలి, 8-పల్లేరు.

వీనికి శాపనివర్తి క్రమము.

శుభలగ్నమునందు ఈమూలికలకడ కేగి సాంబ్రాణివేసితూర్పు ముఖముగఁ గూర్చొని, దిగువఁ జూపిన యంత్రమును వ్రాసి, యీ దిగువఁగనిన మంత్రమును పండ్రెండుమారులు జపింపవలయును.




మంత్రము:—ఓంశ్రీం హ్రైం క్లీం సౌం శివాయనమః పటుపటుస్వాహా.

1. అడ్డసరము.

నిఘంటువు:—వాసిక - సింహపర్ణి - వృషవాస - సింహిక - అటరూప - సింహాముఖీ - భిషజ్మాత - ఆటరూషిక - వాస - సితపర్ణి - వాజి - గంధక యివి అడ్డసరము పేళ్లు.

గుణోపయోగములు.

అడ్డసరము చేదుగఁ జల్లగ నుండును. ఇది పిత్తము-శ్లేష్మము-దగ్గు-క్షయము-హృద్రోగము-వాంతి-జ్వరము-దప్పి-రక్తదోషము-మేహము-కుష్ఠువు వీనిని హరించును. వాత సుస్వరములను గలుగం జేయును.

2. కటుకరోహిణి.

నిఘంటువు:—కటుక - మత్స్యశకలా - మత్స్యపిత్త - రోహిణి - తృష్ణా భేద - కాండరుహ - కటుకరోహిణి - అశోకరోహిణి - తిక్త - చక్రాంగి - శకులాదని - అరిష్ట - తిక్తకర్టోహిణి - ఆమఘ్ని - శతపర్వా - విప్రాంగి - జనని - జన - బకుళ - సాదని - కండ్వా - చండరుహ కుచ యివి కటుకరోహిణి పేళ్ళు.



గుణోపయోగములు.

కటుకరోహిణి చేదుగ నుండును. పిత్తము, కఫము, శైత్యము, రక్తదోషము, తాపము, జ్వరము, దగ్గు, అరుచి, విషమజ్వరము వీనిని బోఁగొట్టును.

3. తాడి.

తాడి నేలతాడియని రెండువిధములు.

నిఘంటువు:—విభీతక - కర్షఫల - వాసంత - అక్ష - కలిద్రుమ - సంవర్తక భూతవాస - కలివృక్ష - విభీదక - ఉపవనసంభూత - సుమూల బహువీర్యక - సంఘూత - తుషజాత - వింధ్యవాసి - వసంతక - బహువీర్యపర - లక్ష్మ - వినాళ - అక్షఫల యివి తాడి పేళ్లు.

గృష్టి - విష్వక్సేన - వారాహి - సూకర - వర - మాధవ - సౌకరి - కాసి - కాంత - వనమాలిని - ముసలి - ఖలివి - తాలపత్రి - కాంచనపుష్పిక - మహావృక్ష - వృక్షకంద - ఖర్జూరి - తాలమూలిక యివి నేలతాడి పేళ్ళు.

గుణోపయోగములు.

తాడికాయ చేదుగఁ జులకనగ శీతలముగ నుండును. ఇది బలాసరోగము, కాసము, నేత్రరోగము, కఫము, వాతములను హరించుటయేగాక కేశవృద్ధికరము జీర్ణకారి.

నేలతాడి యుష్ణముగ నుండును. కఫము, దురద, మేహము, రక్తదోషము, క్షయము, కుష్ఠువు, క్రిమిరోగము వీనిని నివర్తి చేయును. ధాతుపుష్టి, బలము, శరీరపుష్టిని గలుగఁజేయును.

4. తీటకసివెంద.

ఇది తీటకసివెంద, పిన్నతీటికసివెందయని రెండువిధమును.

నిఘంటువు:—మాస - యవాసక - అనంత - బాలపత్ర - కంటక - దూరమూల - సముద్రాంత - దీర్ఘమూల - మధూద్భవ - కచ్చుర - గాంధారి - వికర్ణిక యివి తీటకసివెంద పేళ్లు.

ధన్వయాస- దురాలంభ- తామ్రమూలి- కచ్ఛుర- దురాలభ- దుస్స్పర్శ- యాస- ధన్వయవాసక- సూక్ష్మపత్ర- కష- గ్రాహిణి- దూరవిగ్రాహ- ప్రచోదని- విరూప- ఫణిహారి- విషాపహా- మరూద్భవ- శ్యామ- పీలుక- దరి ఇవిపిన్నతీటకసివెంద పేళ్లు.

గుణోపయోగములు.

తీటకసివెంద రుచికరమైయుండి దప్పి, తాపము, మలబద్ధము, జ్వరము, విషము, వాంతి, శ్వాసము, మూర్ఛలను హరించును. పిన్న తీటకసివెంద రుచికరముగ శీతలగుణముకలదైయుండును. దీనిననుపాన విశేషములతో సేవించినయెడల దప్పి, తాపము, పిత్తజ్వరము వీనిని నశింపజేయును.

---

4. సుగంధిపాల.

ఇది తెలుపు నలుపు భేదములచే రెండువిధములు.

నిఘంటువు:—శారిబి, శారద, గోప, గోపవల్లి, ప్రతానిక, గోపకన్య, లత, శ్వేతలత, కాష్ఠశారిబ, ఉప్పల, శారిభ, అనంత, కరాళ, గజజిహ్వక, సుగంధమూల, భల్లి, ఛల్లి. తెల్లసుగంధిపాల పేళ్లు.

శారిబ, కృష్ణమూల, కృష్ణచందనశారిభ, భద్ర, చందన గోప, చందన, కృష్ణవల్లి, సుభద్ర, త్రిదశ, మసూర, కాల పేశిక, మహాశ్యామ, పాలంది, జంబూవల్లి, దుగ్ధగర్భ, నీవల్లి స్వేతిక యివి నల్లసుగంధిపాల పేళ్లు.

గుణోపయోగములు.

తెల్లసుగంధిపాల మధురముగ నునుపుగ శీతలముగ నుండును. గ్రహణి, త్రిదోషములు, వాతము, రక్తదోషము, పిత్తము, ఆమచలనము, జ్వరము, తాపములను హరించును. నల్లసుగంధిపాల విరేచనము, కఫము, వాతము, దప్పి, అరుచి, రక్తపిత్తము, శూలలనుహరించి అగ్ని దీపనమును గలుగఁజేయును.

---



6. దూలగోవిల.

నిఘంటువు:—కపికచ్ఛు-ఆత్మగుప్త-స్వయంగుప్త-హర్షిణి-లాంగూలి-కండూర- మర్కటీ-దూరవిగ్రహ- బదరి-ప్రావృషాణి-శూకబింబ-జడ యివి దూలగోవిల పేళ్ళు.

గుణోపయోగములు.

దూలగోవిల రుచిగనుండి రక్తపిత్తము, వాతము, పిత్తము, రక్తదోషము, దుష్టవ్రణములు వీనిని నశింపఁజేసి వీర్యవృద్ధిని గలిగించును.

---

7. నీలి.

నిఘంటువు:—నీలిని- నీలిక- కాళ- గ్రామ్య-తూణి-విశోధని-తుచ్ఛ-శ్రీఫలిక- మేళ- భారవాహి- రంజని- వృత్తిక- నీలపుష్ప- జనకేశిక- నీలప్రారుణిక-కృష్ణ-క్లీత-నీలకేశిక-చారజి-గంధపుష్పఫల- అమృత- ఉపభూత- కేశరుహ- భృశపత్రక - ఆవర్త- వర్ణాస- అక్షి- జయావహ యివి నీలి పేళ్ళు.

గుణోపయోగములు.

నీలి వగరుగ నుష్ణముగ చేదుగ రుచ్యముగ నుండును. కఫము, విషము, మహోదరము, వాతరక్తదోషము, క్రిమిరోగము, హృద్రోగము, శోఫ, కుష్ఠము, గుల్మములను హరించి కేశంబుల వృద్ధిపఱచును.

---

8. పల్లేరు.

నిఘంటువు:—గోక్షుర- భక్షుక- స్వాదుకంటక- గోకంటక- భక్షురక- షడంగ- క్షురక- గోకంటిక- గోక్షురాక- శరణ్యా- త్రికంటిక- త్రికంటక- కంటఫలము- శ్వదంష్ట్ర- వ్యాళదంష్ట్రిక- ఫలంకష, వనశృంగాటక, స్థలశృంగాటక యివి పల్లేరు పేళ్ళు.

గుణోపయోగములు.

పల్లేరు శరీరపుష్టి, ధాతువృద్ధి, త్రిదోషశమనము, అగ్నిపుష్టి వీనిని కలిగించును. శూల, హృద్రోగము, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహము వీనిని హరించును.

రోగ లక్షణము.

క్షయము:—క్షయము వచ్చుటకు మునుపు శ్వాస, శరీరమునొప్పులు, కఫముగిలయుమ్మి, దవడలు లోపలికి దించుకొనిపోవుట, వాతి, ఆకలిమందము, మదము, పీనస, దగ్గు, నిద్ర, దేహమెండుట ఇట్టిగుణములు కలుగును. కనులు తెల్లపడును, మాంసముపై ప్రియము, స్త్రీలతో రమింపవలయునను బుద్ధియు నుండును స్వప్నమునకాకులు, చిలుకలు, గోరువంకలు, నెమళ్ళు, గ్రద్దలు, కోతులు, తొండలు ఈ యేడుజంతువులందు నేదియో యొకటి తన్ను మోసుకొనిపోవునట్లును, నీళ్ళులేనియేళ్లను, ఎండిపోయిన చెట్లను, గాలికిఁబడిన చెట్లను, పొగతోఁగూడిన కాఱుచిచ్చుచే గాలునట్టివానిని జూచును. ఈక్షయమునకు ముఖ్యలక్షణములు మూఁడు. భుజములందు ప్రక్కలయందు నొప్పియో సంతాపమో యుండును. కాళ్లు చేతులు మంట లెత్తును. జ్వరము వచ్చును. కంఠస్వరముమారి భుజములు ప్రక్కలయందునొప్పి, భుజములు ప్రక్కలు ముడుచుకొని జ్వరము, దాహము, అతిసారము, రక్తముపడుట, తల భారమైయుండుట, అన్నమందిష్టములేకుండుట, కాస, హీనస్వరమగుట యీ పదునొక్క లక్షణములతోఁగాని, ఆరులక్షణములచేతగాని గూడియుండిన క్షయరోగిని వదలవలయును. కాస, శ్వాసము, రక్తముపడుట, వీనితోఁ గూడియుండిన ఆరింటిలో సగము సగముగ గలిగి యుండినను బలముతగ్గినను చికిత్సలేదు. విస్తారముగ నన్నము తినుట, కొద్దిగాతినుట, అతిసారము, వృషణస్థౌల్యము, స్థూలోదరముండునపుడు చికిత్స చేయరాదు. క్షయము వచ్చినపుడు జ్వరము తగులక బలవంతుడై పనులయం దోర్పుకలిగి యాకలి యెత్తి చిక్కకయుండువానికి చికిత్సచేయ నగును. క్షయము వచ్చి వేయుదినములైనయెడల రోగముకుదురుట యసాధ్యము. కన్నులు తెల్లపడి ఊర్ధ్వశ్వాసము, అన్నద్వేషము గలిగి కష్టముపై మూత్రము వదలువాడు జీవింపడు.



అరుచి:—నోటికిచేదు, పులుసు, వేడి, విరసము, చెడుగబ్బు, ఉప్పు, మాధుర్యము యివి కలుగును. ఉమ్మి గట్టిపడును, కడుపున భారముండును; అన్నము మ్రింగుడుపడదు; ఱొమ్మున నొప్పి, దాహము, తాపము, అసహ్యము, ఉమ్మివచ్చుట యివి కలుగును. ఆకలియుండినను భక్షింపశక్తిలేకపోవుట, కోరినయన్నముంచినను దిననియ్యకుండుట, అన్నముపేరు విన్నంతమాత్రమున, తలచినమాత్రమున, చూచినమాత్రమున భయపడుట యివి యీరోగమున కానవాలు.

వాతి:—వాతి కలుగుటకు మునుపు గుండెలయందు నొప్పి- ముఖమునఁజెమట- నోరుప్పనైయుండుట-అన్నపానములందు ద్వేషము ఇవి కలుగును.

## వ్యాసులు.

వీరు వక్కాణించిన 1-పెన్నేరు 2-ఆముదము 3-పీచర 4-జ్యోతిష్మతి 5-ప్రంగ 6-రేల 7-సంబరేణు 8-దవనము.

వీని శాపనివర్తి క్రమము.

శుభలగ్నమునందుఁ జెట్టునొద్దకేగి యాదువత్తి ముట్టించిపెట్టి దాని యడుగున నేలలో నీదిగువ యంత్రమును వేసి యీ దిగువ వ్రాయఁబడిన మంత్రమును తొమ్మిదిపర్యాయము లుచ్చరించినయెడల శాప నివర్తి. పంచదార నైవేద్యము.




మంత్రము:—క్రోమక్రోమ సంహార కోలాహాలా ఏహ్యేహి శివాయ ఏహి నం మం శిం వం యం స్వాహా.

### 1. పెన్నేరు.

నిఘంటువు:—అశ్వగంధ- వాజిగంధ- కంబుల- అశ్వ- అవరోహక- పరాహాకర్ణి- తురగి- బల్య- వాజికరి- వర- గాత్రకరి- పుణ్య- కుష్ఠగంధ- పీవరి యివి పెన్నేరు పేళ్ళు.

గుణోపయోగములు.

పెన్నేరు వగరు నుష్ణముగ చేదునైయుండును. కఫవాతముల, విషము, వ్రణము, క్షయము వీనిని హరించి దేహమునకుఁ గాంతి, వీర్యము బలమును గలిగించును.

---

### 2. ఆముదము.

ఇది తెలుపు ఎఱుపు భేదములను రెండువిధంబులం గలది.

నిఘంటువు:—ఏరండ, తరుణ, శుక్ల, చిత్ర, గంధర్వహస్తక, పంచాంగుళ, వర్ధమాన, ఆమండ, దీర్ఘదండక- రుచక- చిత్రక- చంచు- పత్రి- విడంబక- ఉరుబూక- వృద్ధవహ- గంధర్వ- ఘనవల్లభ యివి తెల్లాముదము పేళ్ళు.



రక్తైరండ, హస్తికర్ణ, వ్యాఘ్రి, వ్యాఘ్రితర, ఉరుబు, ఉరుబూక, హస్తికర్ణ, చుంచు, ఉత్తానపత్రక, వ్యాడంబక, వ్యాఘ్రిపుచ్ఛ, రుచక, వాతనాశన, పైడంబక, దీర్ఘవృంత, రుబు, ఏరండ యివి ఎఱ్ఱాముదము పేళ్ళు.

గుణోపయోగములు.

ఇవి రెండును జేదుగ గురువుగ నుష్ణముగ నుండును. వాతము- గుల్మము- అష్ఠీలరోగము- గుదరోగము- ఉదావర్తరోగము- పొత్తికడుపు నొప్పి- ఆంత్రవృద్ధి వీనిని హరించును. ఆముదమును కషాయముతోనైన కల్కముతోనైన పాలతోనైన సేవించినయెడల వాతము. రక్తదోషము- అర్శస్సు- జ్వరము- ఉన్మాదము- అర్దితవాతము- కటిప్రదేశము, తొడ- ప్రక్కలు వీనియందు నొప్పి శోష- శోఫ- వణుకులను బోగొట్టును.

---

### 3. పీచర.

ఇది పిల్లిపీచర పిన్నపీచరయని రెండు విధములు.

నిఘంటువు:—శతావరి, శతపది, పీనరంది, వరి, వర- రుశ్యప్రోక్త- గ్వీశత్ర, ద్వీపిక, అధరకంటక యివి పిల్లిపీచర పేళ్ళు.

సహస్ర, వీర్య, భీమ, తుంగిని, బహుపుత్రిక, మహాపురుషదంత, శతాయు, ఊర్ధ్వకంటక, శతమూలి, శతాక్షు, సాదురస్యమహోదరి, సూక్ష్మపత్ర, అశ్మశల్య, నారాయణి, జట, గోరక్షుతండుల, మాల, వర, వృక్షోరుహ యివి పిన్నపీచర పేళ్లు.

గుణోపయోగములు.

ఇవి రెండును చేదుగ నుండును. రక్తపైత్యము, అతిసారము, ప్రమేహము, వాతము, ఉష్ణప్రకోపము, క్షయము, కృశత్వము, భ్రమ, మూర్ఛ, తాపములను హరించి వీర్యవృద్ధిని గలిగించును.

---

### 4. జ్యోతిష్మతి.

ఇది జ్యోతిష్మతి పెద్దజ్యోతిష్మతియని రెండు విధములు.

నిఘంటువు:—జ్యోతిష్మతి, కటభీ, సూక్ష్మపర్ణ, లతా, ఉపాణిక, అగ్నిభాస, లవణ, ధూమల, లవణి, కింశుక, వేగ, కాకాదని, త్రిపర్ణి పీతతైల, విషస్వర్ణి, కుకుందరి, కుమాణిక యివి జ్యోతిష్మతి పేళ్లు.

తేజస్విని, తేజవతి, తేజాహ్వ, తేజని, అశ్వఘ్ని, వల్కలాగ్ని, పారిజాత, మహాజసి, పారావతపద, వర్ణ్యా, లతా, కంగణిక యివి పెద్దజ్యోతిష్మతి పేళ్లు.

గుణోపయోగములు.

జ్యోతిష్మతి కారముగ చేదుగ నుష్ణముగ నుండును. ఇది కఫము, విసర్పి- వాపు- పాండువు- జలోదరము- భగందరము-శోష- నేత్రరోగము- పీనస- వాతముల హరించును. విరేచనకారి.

పెద్దజ్యోతిష్మతి కారముగ చేదుగ నుండును. కఫశ్వాసకాస శూలామవాతముల బోగొట్టును. జీర్ణపఱచును. కాకచేయును.

---

## 5. మ్రంగ.

ఇది మ్రంగ పెద్దమ్రంగయని రెండు విధములు.

నిఘంటువు:—మదన- శల్యక- రాతి- పిండి- పిండీతక- ఫల- తగర- కరహాట-శ్వసన- విషపుష్పక- స్నేహ- భండీతక-వస్తిశోధన- ఛర్ధన- వామక- తుగాల- మరూనక- విషముష్టి- ప్రద్యుమ్న- వమధూఫల యివి మ్రంగ పేళ్లు.

వరాహ- కృష్ణఫల- మహాపిండీతక- మహాన్ యివి పెద్ద మ్రంగ పేళ్ళు.

గుణోపయోగములు.

మ్రంగ చేదుగ నుండి ఆమాతిసారము- రక్తదోషము- వ్రణము- శ్లేష్మము- జ్వరము- పీనస- గుల్మము- విద్రధి- వాతము- శోఫ- కడుపుబ్బరము- జ్వరము- పైత్తికడుపునొప్పి- కాసము వీనిని హరించును. వాంతికి సేవించిన వాంతియగును. పెద్దమ్రంగ కారము చేదునుగలది. వాంతి చేయించును. కఫము హృద్రోగములను బోగొట్టును. పక్వాశయ మామాశయములను జక్కగా శోధించును. మ్రంగకాయ త్రిదోషముల హరించును. మధురమైయుండును. సకల రోగములను



ఖండించును. అగ్నిదీపనము- శరీరపుష్టి- పిత్తము వీనిని గలుగఁజేయును. కఫము- వాతము- కాసము-శ్వాసము- క్షయము- క్రిములు- వ్రణములు వీనిని హరించును. మ్రంగపండు కాసము- వాంతి- వాపు- వ్రణము- విషములను నశింపఁజేయును.

---

## 6. రేల.

నిఘంటువు:—కర్ణికార- రాజవృక్ష- ప్రగ్రహ-కృతమాలక-సారోగ్య- శంబి- శమ్యాక- వ్యాధిఘాత- అనఘాతక- ఆరగ్వధ- దీర్ఘఫల- వ్యాధిఘ్న-చతురంగళ-ఆరేవత-కర్ణి-కర్ణికార- రేచక-కుండలి- హేమపుష్ప-పరివ్యాధ- నృపద్రుమ-స్వర్ణశేఫాలిక- స్వర్ణ-కుష్ఠసూదన- స్వర్ణశల్య- ఆమఘాత-స్వర్ణద్రు- క్రిమిమారక యివి రేల పేళ్ళు.

గుణోపయోగములు.

రేల గురుత్వము చేయును. రుచిగ జల్లగనుండును. ఇది మృదు విరేచనకారి. జ్వరము- హృద్రోగము- పిత్తరక్తము- వాతము- ఉదావర్తము- శూలలను నశింపఁజేయును. దీనిపువ్వులు వాతమును గలిగించును. మలమును బంధించును. చేదైయుండును. పిత్తకఫముల హరించును. రేలగుజ్జువండిన మధురమైచిరుచేదైయుండును. వాతపిత్తములఁ బోగొట్టును. రేలాకు విరేచనకారి. కఫమును మేదోరోగమును హరించును. రేలపండు తీపుగా బలకారియైయుండును. వాత పిత్త జ్వరములను హరించును.

---

## 7. సంబరేణు.

నిఘంటువు:—సాతళ- సప్తళ-సారి- విద్రుళ-విమల- బహుఫేన- చర్మకాస- ఫేన- దీప్తి- మరాళిక యివి సంబరేణు పేళ్ళు.

గుణోపయోగములు.

ఇది వగరైయుండి కఫము- పిత్తము- త్రిదోషములు- ప్లీహము- గుల్మము- మహోదరము- శోఫ- పాండురోగము వీనిని హరించును.

### 8. దవనము.

ఇది దవనము-తోటదవనము-గడ్డిదవనమని మూడువిధములు.

నిఘంటువు:—దవనము- పాండురంగము- తుతము- గంధోత్కటము- ముని- పుండరీకము- బ్రహ్మజట- ఋషిపుత్ర- తపోధన యివి దవనము పేళ్ళు. ఋషి-దమనక- క్షమ- శాంతిపర- సాధు- సాధక- సాధుగంధ- యివితోటదవనముపేళ్లు. చోరక-శంకిత- చండ- దుష్పుత్ర- క్షోమక- రిపు- గణహాస- కోపనక- కితవ- ఫలచోరక- దుష్కుల- పశ- ధూర్త- పటనోర-నిశాచర యివి గడ్డిదవనము పేళ్ళు.

గుణోపయోగములు.

దవనము తోటదవన మివిరెండును చేదుగ నుండును. విషము- భూతదోషము- త్రిదోషములు- దురద- కుష్టువుల నివర్తించి మనస్సునకు సంతోషము కలుగఁజేయును.

గడ్డిదవనము మిగుల శీతలమైపరిమళమై రుచికరముగనుండును. పిత్తము- రక్తదోషము- కఫము- కుష్టువు- వాతము వీనిని హరించి అగ్ని దీపనమును గలిగించును.

## విశ్వామిత్రుడు.

ఈ మహర్షి వర్ణించిన 1-కురువేరు- 2-చాగ- 3-తక్కలి- 4-చేతిసార- 5-దేవదాళి- 6-దోస- 7-దూసరితీగ- 8-వేము.

వీనికి శాపనివర్తి క్రమము.

శుభలగ్నమున నీమూలికలచెంత కేకి ఊదువత్తి వెలిగించి ఈ దిగువ చూపిన యంత్రమును నేలయందు వ్రాసి ఈక్రిందుగున జెప్పిన మంత్రమును తొమ్మిదిమారులు జపించునది. శాప నివర్తియగును.



భైరవపూజా యంత్రము.




మంత్రము:—ఓం రీం క్రోం శిం వం జటాయ జటాయ మహేశ్వరా జటాయ స్వాహా.

### 1. కురువేరు.

నిఘంటువు:—వాలుక- వారి- తోయం- హ్రీబేరం- జలం- అంబ- కేశ్యం- వజ్రం- ఉదీచ్యం-పింగం- ఆచమనం- కచం- దీర్ఘమూలం- బలం- బర్హిష్ఠం- పింగళం- తిక్తాంగం- పీతవాస- కర శాఖ- ఆన్యభాషణం యివి కురువేరు పేళ్ళు.

గుణోపయోగములు.

కురువేరు శీతలముగ వగరుగ నుండును. పిత్తము- శ్లేష్మము- విసర్పి- కఫము- రక్తదోషము- దురద- కుష్ఠువు- జ్వరము- దాహము వీనిని నివర్తించును.

### 2. చాగ.

నిఘంటువు:—మూర్వ-మధురస- దేవి-పృథక్పర్ణి-త్రిపర్ణి- దేవశ్రేణి- స్వాదురస-స్నిగ్ధపర్ణి- మోరట- జ్వాలిని- దహని- తిక్త- వల్కలి- పృథక్త్వచ - మధుశ్రవ- మధుశ్రేణి- లఘుపర్ణి- మధూళిక- పీలుని-పీలుపర్ణి-గోపవల్లి- తేజని యివి చాగ పేళ్లు.

గుణోపయోగములు.

చాగ వగరుగ చేదుగ నుష్ణగుణముగలదిమైయుండును. హృద్రోగము- కఫము- వాతము- కుష్ఠము- దురద- వాతి- మేహము- విషమజ్వరములను హరించును.

### 3. తక్కలి. (కూరనెల్లి.)

ఇది తక్కలి చిరుతక్కలియని రెండు విధములు.

నిఘంటువు:—అగ్నిమంథ - అగ్నిమాధాన - తర్కారి - వైజయంతిక- వహ్నిద- వణకాక- శ్రీపర్ణి- కర్ణిక- జయ- తేజోవృక్ష-అనల- మాథ - స్నాపన - గణికారిక - తనుత్వచ - అగ్నిజోతిష్క విజయ యివి తక్కలి పేళ్ళు.

క్షుద్ర- అగ్నిమథన- జయ- అగ్నిమంథ- రణిక- సౌగంధి- గంధపత్రిక-మహాక్షుద్ర- అగ్నిమథని-అరణి చిరుతక్కలి పేళ్ళు.

గుణోపయోగములు.

తక్కలియు చిరుతక్కలియు చేదుగ వగరుగ నుష్ణముగ నుండును. పాండురోగము- శోఫ-శ్లేష్మము- అగ్నిమాంద్యము- ఆమబద్ధములను హరించును.

రోగ లక్షణము.

ఆమాజీర్ణము:—ఆకలి కఫముచే మందముగను- పైత్యముచే తీక్ష్ణముగను-వాతముచే విషమముగను- కఫవాతపిత్తములలో నొకటి యధికమగుటచే సమానముగ నిటుల నాలుగువిధములైయుండును. మందమైన యాకలి కఫవికారములఁ గలిగించును. తీక్ష్ణముగ నుండునది పైత్యరోగముల బుట్టించును. విషమమైనది వాతరోగముల కునికిపట్టు- తిన్నయన్నము జీర్ణమైన సమాగ్ని- జీర్ణము కాకున్న మందాగ్ని- ఒకప్పుడు జీర్ణించి మఱియొకప్పుడు జీర్ణింపకుండెనేని విషమాగ్ని. సమముగ దిన్న నెక్కువగ దినిన జీర్ణమైనయెడల తీక్ష్ణాగ్ని. ఈ నలువురిలో సమాగ్నికలవాడే ఆరోగ్యవంతుడు. తినిన యాహారమఱుగకున్నను-వేగముగా నఱిగినను- అఱిగియఱుగకున్నను- అజీర్ణము లనిపించుకొనును. ఇవి మూడజీర్ణములు. అన్నరసము పురీషముగ మారక జీర్ణకోశమునందు నిలిచియుండునది నాల్గవది. ఎట్టి దోషములు లేకయున్నను జీర్ణమగుట కొకదినము పట్టునది అయిదవది. అఱిగినది యఱుగగా మిగిలినది ప్రావృతాజీర్ణమిది యాఱవది. అధికముగా నీళ్ళు త్రావిన- విషమభోజనముల దినిన- పగటిపూట నిదురించిన- అకాలముగ నెక్కువగ దినిన- మిగులఁ దక్కువగఁ దినిన అజీర్ణమును పుట్టించును. ఈ యజీర్ణముతో ఆమసంబంధమగునేని భారము - పులితేపులు- కన్నులు బుగ్గలుబ్బుట- తిన్నయన్నము వెలివచ్చుట- జీర్ణింపకుండుట- మలబద్ధము - కూతగలిగి నొప్పితో-అపానవాయువువచ్చుట- వాయువేదనలు- మలవాయువు ప్రవర్తింపకుండుట-శరీరముబిగబట్టుట- చిత్తవిభ్రాంతి- దేహమున నొప్పులు-భ్రమ-దాహము-మూర్ఛలు-చెమట-తాపము-పొగచూరు పుల్లవాతులు కలుగును. అన్నద్వేషము కలుగును. కడుపుబ్బును. ఆమాజీర్ణముచే విషూచి పుట్టును. దేహమున సూదులతో బొడుచునట్లుండిన విషూచి యనఁబడును. మితాహారులకు విషూచి రాదు. మూర్ఛ - అతిసారము - వాతి - దాహము-నొప్పి-భ్రమ-పొర్లడము- ఆవలింత-తాపము-వణుకు హృదయవేదన- శిరస్సుపట్టుకొనిపోవుట యివి సంభవించును.



### 4. చేతిసార.

నిఘంటువు:—కట్వాలాబ- నితుంబ- లంబ- పిండిఫల- బృహత్ఫల-రాజపత్రి- ఉష- ఇక్ష్వాకు- క్షత్రియవర- తిక్తబీజ - మహాఫల ఇవి చేతిసార పేళ్లు.

గుణోపయోగములు.

చేతిసార వాతిని గలుగఁజేయుటలోఁ బ్రశస్తమై యుండును. కాసము, శ్వాసము, జ్వరము, అగ్నిమాంద్యము, స్థావరవిషము, జంగమవిషములను హరించును.

### 5. దేవదాళి.

నిఘంటువు:—జీమూతక, దేవదాళి, వృంతకోశ, గరాగరి, ఆఖువిషహా, వల్లి, దేవదాళిచంద్రిక, మహాకోశఫల, జాలాలి, చతురంగక, కర్కోటకి, కదంబ, ఘోష, రోమశపత్రిక, మూషిక, అంబు, బుధాక, తర్కారి యివి దేవదాళి పేళ్లు.

### గుణోపయోగములు.

దేవదాళి, హిధ్మ, శ్వాస, జ్వరము, శోఫ, పాండు, విషమజ్వరము, శోష, విషము, వాంతి వీనిని హరించును.

---

## 6. దోస.

ఇది చేతిదోస, ములుదోస, నక్కదోస, కరుబూజా దోసయని నాలుగు విధములు.

నిఘంటువు:—కటుక- త్రపుసి - విపాండు- హస్తిపర్ణిని - ఛర్ద్రాయని- మూత్రఫల- లత- కర్కటిక యివి చేతిదోస పేళ్ళు. త్రపుస కంటకిలత- సుధావాస యివి ములుదోస పేళ్ళు. కర్కటి-లోమశి - వ్యాళపత్ర- ఏర్వారు- బృహత్ఫల యివి నక్కదోస పేళ్లు. షడ్భుజ- మధుఫల-వర్డేఖ- వృంతకర్కటి- తిక్తాఫల-మధూక- వృంతోర్వారు-షణ్ముఖ యివి కరుబూజాదోస పేళ్లు.

### గుణోపయోగములు.

చేతిదోస ములుదోస యివిరెండును కఫము, పిత్తము, మూత్ర కృచ్ఛ్రము, పాండురోగము, హృద్రోగము, జ్వరము వీనిని హరించి యగ్నిదీపనమును గలిగించును.

నక్కదోసకాయ శీతలముగ నుండును. తాపము నిచ్చును. మలమును గట్టును. తీపుగ నుండును. గురుత్వము జేయును. రుచిని బుట్టించును. పిత్తమును బోగొట్టును. నక్కదోసపండు కాక, పిత్తము, అగ్నిమాంద్యము వీనిని గలిగించును.

లేతకరుబూజాదోస చేదుగ నుండును. కొంచెము ముదిరిన యెడలఁ దీపైయుండును. పండినపిమ్మట గొంచెము పుల్లగ నుండును. బాగుగపండి మాగినవెనుక పితృదేవతలకుఁ బ్రీతికరమై యుండును. పుష్టి నిచ్చును. శుక్లమును వృద్ధిపఱచును. తాపము శ్రమ వీనిని బోగొట్టును. మూత్రమును వృద్ధిపఱచును. పిత్తము, ఉన్మాదము వీనిని హరించును. దీర్ఘకారియై యుండును.

---



## 7. దూసరితీగ.

నిఘంటువు:—శితివార- సూచిపత్ర-శూల్యక- సునిషణ్ణక- శ్రీవారక- శిఖీవార- స్వస్తిక- కుక్కుట- శిఖి యివి దూసరితీగె పేళ్లు.

### గుణోపయోగములు.

దూసరితీగె గురుత్వము- మలబద్ధము- త్రిదోషములు- కాసము- గ్రంథివాతము- వ్రణము- వాపు వీనిని నివర్తించి అగ్నిదీపనము వీర్యవృద్ధిని గలిగించును.

---

## 8. వేము.

ఇది వేము- పెద్దవేము- నేలవేము అని మూఁడువిధములు.

నిఘంటువు:—నింబ- నియమన- నేతృ- పిచుమంద-సుతిక్తక- అరిష్ట- సర్వతోభద్ర- ప్రభద్ర- పారిభద్రక- శుకప్రియ- సీతపర్ణ- యవనేష్ట- వరత్వచ-ఛర్దన- హింగునిర్యాస- ప్రియసార-రవిప్రియ యివి వేము పేళ్ళు. మహానింబ- ద్వేక-కాకాంత-విషముష్టిక- కేశదృష్టి- నింబవర-రమ్యాక- అక్షీర-కైటర్య-యవనేష్ట- రావణ- రామణ- శోకసాల- మహారిష్ట- వరతిక్త- అతినింబక- నేపాళ- పార్వక- జీర- గిరిక- శుక్లసారక- చలాలక- కింపత్ర యివి పెద్దవేము పేళ్ళు. కిరాతతిక్తక- హేమ- కాండతిక్త- కిరాతక- భూనింబ- నార్యతిక్త- కైరాత- రామసేనక- నేపాళ- జాతిభేద- జ్వరాంతక- నాడితిక్త- ఊర్ధ్వతిక్త- నిద్రారి- సన్నిపాతహా యివి నేలవేము పేళ్ళు.

### గుణోపయోగములు.

వేము చేదుగఁ జల్లగ నుండును. తాపము, శ్లేష్మము, రక్తదోషము, పిత్తము, కుష్ఠము, దురద, వ్రణము, విషమజ్వరముల హరించును. దీనిలేపనము భక్షణచేసినయెడల మారివలనగలుగు నుపద్రవములు నివర్తించును. పెద్దవేము చేదుగనుండును. ఇది శీతపైత్యము, కఫము, కుష్ఠము, రక్తదోషము, బేదులు, కడుపునొప్పి, కఫము, పిత్తము, శోపావ్యాధి, కాస, జ్వరములను నశింపఁజేయును. నేలవేము చేదుగ

నుండును. పిత్తము, శ్లేష్మము, వాతము, సన్నిపాతజ్వరము, దప్పి గుల్మము, రక్తదోషము, కాసము వీనిని హరించును.

రోగ లక్షణము.

మేదోరోగము :—మేదస్సనగా మెదడుకాదు క్రొవ్వు. ఇది పగటి నిద్ర, శ్లేష్మాహార సేవనము, పరిశ్రమ లేకుండుట వీనిచేఁ గలుగును. దీనిచే నుదరమునందు మార్గములన్నియు నావరింపఁబడుటచే నితరధాతువులభివృద్ధినొందక క్రొవ్వు అధికమగును. ఇతరములైన పనులను జేయుటకులేక యశక్తుడగును. చిన్న చిన్నశ్వాసలు, దాహము, మైకము, స్వప్నములు, ఊపిరి బిగబట్టుట వీనితోగూడి యాకలిగలిగి దేహమంతటఁ జెమటయు దుర్గంధమును తక్కువబలము స్వల్పమైథునము గలవాఁడగును.

# వసిష్ఠుఁడు.

ఇతఁడు చెప్పిన 1-పర్పాటకము, 2-పాపర, 3-దంతి, 4-గుమ్ముడు, 5-గోరింట, 6-వాకుడు, 7-విషబొద్ది, 8-అరటి. వీనికి శాపనివర్తిక్రమం.

ఈ మూలికల చెంతకేగి శుభలగ్నమునందు నేలలో నడుగనిన యంత్రమును వేసి సాంబ్రాణివత్తి వెలిగించి యుంచి తొమ్మిదిమారు లీదిగువఁగన్న మంత్రమును ధ్యానించిన శాపములు నివర్తియగును.

అష్టలక్ష్మిపూజా యంత్రము.





మంత్రము:—ఓం శివా శ్రీం రీం వజ్ పటు పటు స్వాహా.

1. పర్పాటకము.

నిఘంటువు:—పర్పటి- పర్పటిక- వరతిక్త- కచ- రజ- రేణు- పాంసు- కవచ- వర్మకంటక- శీత- శివప్రియ- పిత్తఘాతి- తృష్ణహా- రక్తపుష్ప- అతిసారఘ్న- వరద- జ్వరనాశన యివిపర్పాటకముపేళ్లు.

గుణోపయోగములు.

పర్పాటకము శీతలముగ వగరుగ నుండును. పిత్తము, శ్లేష్మము, జ్వరము, రక్తదోషము, తాపము, అరుచి, శ్రమము, మదము, భ్రమము వీనిని హరించును.

2 పాపర.

ఇది పిన్నపాపర పెద్దపాపరయని రెండు విధములు.

నిఘంటువు:—ఇంద్ర- ఇంద్రవారుణి- ఇంద్రాహ్వా- ఇంద్రవార- వృషాదని- గవాదని- క్షుద్రఫల- వృషభాక్షి- గవాక్షి- విటంకోటి- పీర- కసుక యివి పిన్నపాపర పేళ్ళు.

ఇంద్రవారుణి- విశాల- మహాఫల- ఆత్మరక్ష- చిత్రఫల- త్రపుసి- త్రపుసా- శ్వేతపుష్ప- గవాక్షి- మృగోర్వ- మృగాదని- హస్తిదంతి- నాగదంతి- వారుణి- గజబద్భట- కుంభక- మరుసంభూత- చిత్ర- దేవ యివి పెద్దపావర పేళ్లు.

గుణోపయోగములు.

పిన్నపాపర మిగుల నుష్ణము చేయును. విరేచనమును జేయించును. కారముగ నుండును. ఇది క్రిములు, కుష్టువు, దుష్టవ్రణములు, సకలమైనయుదరరోగములు, శ్వాసము, కాసము, గ్రంథులు, మేహము, మూఢగర్భము, కామిల, ప్లీహము, శుష్కగర్భము, గళగండము, విషము, అనాహవాతము, అపచి, ఆమరోగము, బల్లలు, గుల్మములు, పాండువులను హరించును. పెద్దపాపర కంఠరోగము, అజీర్ణము, శ్వాసము, గుల్మము, ప్లీహము, విషము, మహోదరము, మూలరోగము, గర్భము, కుష్టము, దుష్టవ్రణములను హరింపఁ జేయును. పాపరకాయకూర యుష్ణముగ రుచికరముగ మధురముగ నుండును.

అగ్నిదీపనము నొసంగును. ఉష్ణవీర్యముకలదియైయుండును. దేహము నకుపుష్టినిచ్చి బలకరమైయుండును. విరేచనమును జేయించును. గురుత్వము కలిగించును. ఇది వాతపైత్యము, గుల్మము, జ్వరములను నశింపఁ జేయును.

### రోగ లక్షణము.

అనాహరోగము:—ఆమము పురీష మీ రెంటిలో నొకటి దినాలపేరట నిలవగా నుదరములోనుండి వృద్ధినంది దుర్వాయువులతోఁ జేరి నిజస్థితినుండక వికారములను గలిగించును. ఆమమువలన గలిగిన యనాహమున తృష్ణ, పీనస, తలలోమంట, ఆమాశయమునందుశూల, కడుపునభారము, హృదయస్తంభనము, తేపులు రాకుండుటను నిలుపును. కటియందును, వీపునందును, పురీషమూత్రములందును స్తంభనము, శూల, వాతి, వాపు, నంజు ఇట్టి గుణములు దుర్వాయువు జీర్ణకోశమునసున్నపుడు కల్గును.

మూఢగర్భము:—అకస్మాత్తుగ భయముకలిగిన, దెబ్బతగిలిన, తీక్ష్ణోష్ణమగు నన్నపాన సేవనముచేసిన గర్భముపతనమగును. శూలతోడ రక్తము కనిపించును. నాలుగు నెలలవఱకు మూత్రమే రక్తము పడును. ఆవల శరీరముతోఁబడును. దెబ్బ తగులుట, విషమభోజనము, పిసికులు మొదలగువానిచే దోరకాయను గొట్టిన తొడిమనుండి వీడిపడునటులఁబడును. అపుడు విషమగతినందినవాయువుగర్భమునుగదలించి యోనియందుశూలను బుట్టించి జఠరాదులందుమూత్రమును వృద్ధిజేసి గర్భపాతనంబు కలిగించును. గర్భమున నుండెడి శిశువులు ఏనిమిది విధములుగాఁ దిఱుగుటచే గర్భవతి కనేక బాధలు గలవు. అవి యేవియనిన:—(1)శిశువు శిరస్సు యోనిద్వారమును గప్పును. (2) శిశువు పొట్టద్వారమును గప్పును. (3) తిరుగునపుడు వంకరగా శరీరమును ముడుచుకొనుటచే ద్వారముపట్టదు (4) ఒకచేతిని బ్రక్కగాఁ జాపును. (5) రెండుచేతులను రెండు ప్రక్కలకుఁజాపును. (6) అడ్డము తిరుగును. (7) ముఖమును తలక్రిందు చేయును. (8) ప్రక్కలకు జారును. ఇవిగాక మఱి



నాలుగువిధములు గలవు. (1) శిశువు చేతులు కాళ్ళు తల పైకినెత్తి వీపుతో ద్వారమును కప్పిన చీల బిగగొట్టినటుల బిగిసి గర్భవతికి వేదన గలిగించును. (2) కాళ్ళు నేతులు మాత్రము కనబడుచుండి దేహము ద్వారమును దాటి రాదు. (3) భుజములు రెండును దలనొకటిగానుంచికొని వెలివచ్చును. (4) ద్వారమునకు శీఘ్రముగా రాకుండిన గొడ్డలితో గొట్టినటుల నధిక బాధ గలుగును. ప్రసవస్త్రీ తలనిలుపక, చలువలుగ్రమ్మి, లజ్జలేక, నల్లని ప్రేవులు ద్వారమార్గముగ వచ్చుచుండినయెడల నది బ్రతుకదు. తల్లి దుఃఖములచే గర్భస్థ శిశువు పీడింపఁబడి కడుపులోనే చచ్చినంజచ్చును. లేక వ్యాధిగ్రస్థుడై పుట్టును. గర్భమునం దుండెడి శిశువు చనిపోయినయెడల గర్భము కదలదు. ప్రసవ చిహ్నములు కనిపింపవు. శరీరము నలుపెక్కి పాలిపోవును. శరీరము కొందఱి కుబ్బును. నోటిగాలి దుర్గంధమైయుండును.

## 3. దంతి.

ఇది పిన్నదంతి పెద్దదంతియని రెండువిధములు గలది.

నిఘంటువు:—దంతి- శీఘ్ర- నికుంభ- ఉపచిత్రా- మూలిక- పద- ఉదుంబరపర్ణి-విశల్యా- గుణప్రియ యివిపిన్నదంతి పేళ్లు. దీనిని నేలదంతియనియుం జెప్పుదురు.

వరణి- వరాంగి- జయావహ- ఆవర్తక- కేశరుహ- వృషభద్రక- విశోధని- శ్యేనఘంట- మధుపుష్పచ్ఛద- సాగస్ఫోట- విశాల- కల్ప- ఏరండఫల యివి పెద్దదంతి పేళ్లు.

### గుణోపయోగములు.

పిన్నపెద్దదంతు లివి వగరుగ నుష్ణముగఁ జేదుగనుండును. ఇది కఫము, వాతము, మహోదరము, అర్శస్సు, వ్రణము, మూత్రకృచ్ఛ్రము, శూల వీనిని హరించి అగ్నిదీపనము మలశోధనంబుల జేయును.

రోగ లక్షణము.

ఉదరరోగము:—ఈ రోగములు మందముచేతను, అజీర్ణసమయమున భుజించుటచేతను, పురీషాది మలము లుదరమున నొకచోట నిలిచియుండుటచేతను బుట్టును. యిది చెమట వెలివచ్చు మల జల ద్వారములు నడ్డగించును. చెమట లోన నిముడుటచే దోషము లుదరంబున నిలుచును. ఈ దోషములచే ప్రాణ వాయువు, జఠరాగ్ని, అపానము వీనికి దోషములు కలిగి యుదరరోగము కలుగును. పొట్ట యుబ్బియుండును. నడుచుటకు శక్తియుండదు. దేహమున బలముండదు. ఆకలి మందమగును. నంజు దేహమునందలి కాళ్ళు సేతులు మొదలయిన యంగములుచిక్కుట వాయు పురీషము యివి కలిగియుండును. దాహము, తొందరలు కలుగును. యివి యుదరరోగములకు సామాన్యమైనవి. యివి యెనిమిది విధములై యుండును. (1) నంజు, కాళ్లుసేతులు బొడ్డువాచును. పొట్ట, ప్రక్కలు, పిఱ్ఱలు, వీపు వీనియందు నొప్పులు తీపులు గలుగుట, పొడిదగ్గు, దేహమంతట నొప్పులు, భారము, మలబద్ధకము, బూడిదపూసిన ఎఱుపురంగుగల దేహము, అకస్మాత్తుగ పొట్టతగ్గుట, హెచ్చుట కడుపున శూలవంటినొప్పి, నరములునలుపై కొంచెము వెలికి దెలియుట కొలిమితిత్తినుండివచ్చుశబ్దమువలెనొటధ్వనివచ్చుట అదియు నణగిపోవుట, నొప్పితోఁ గూయుచు కడుపంటల వాయువు తిరుగుట యివి యుండును. దీనిని వ్యాతోదరమని వ్యవహరింతురు. (2) జ్వరము, మూర్ఛ, కడుపునమంట, దప్పి నోటిచేదు, భ్రమ, అతిసారము, దేహము పచ్చనగుట, కడుపున మఱింతపసపువర్ణముకలుగుట, నరము లెఱ్ఱగపచ్చగఁగనిపించుట, చెమట, వేడియైనపెద్దయూపిరి, దేహమంతటమంట, పొగమాదిరి పైకేగుట, తాకినపుడుమెత్తగనుండుట, అన్నము వేగముగ జీర్ణమగుట యిదే జలోదరమునకు పునాది. దీనిని పైత్యోదరమందురు. (3) దేహము చిక్కిపోవుట, ఎడతెగని నిద్ర, వాపు,బరువు, నిద్రచే ఒడలువిరుపు, అరుచి, శ్వాసము,



పొడిదగ్గు, పాలిపోవుట, ఉదరము స్థిరమై నున్ననై యుండును. తెల్లని నరములు కనబడును. పొట్ట కఠినమై చల్లగ నుండును. ఇది శ్లేష్మోదరము. (4) దుష్టలకు స్త్రీలచే నియ్యబడిన యన్నపానంబునందలి దోషము, శత్రువులు ప్రయోగించు విషము వీనిచే రక్తములుచెడి కడుపును బెంచును. చలిగాలి కొట్టినపుడు ముసురుబట్టి జడివానలు గురియునపుడు ఈ వ్యాధి వెలివడును. కడుపున మంటబుట్టి మైకమును గలిగించును. పాండుదేహియై కృశించి తాపముగలిగియుండును. దీనిని దూష్యోదరమందురు. (5) విదాహాతిసారములుగలవానికి రక్తశ్లేష్మములు దుష్టమై పీనస నభివృద్ధిచేయును. ఇది యెడమప్రక్కవృద్ధినంది బాధ కలుగును. మందాగ్ని మందజ్వరములఁగలిగి పైత్యశ్లేష్మములచే నుపద్రవమందును. దీనిని ప్లీహోదరమందురు. కుడివైపు పార్శ్వమున గుండెమాంసము వృద్ధినందినయెడల నకృద్దార్యుదమని చెప్పబడును. (6) పురీషమునిరోధింపబడిబయట రాకబలవంతముగవచ్చినయెడల గొంచెముకొంచెముగ బడును. దానిచే బొడ్డుమొదలెదరొమ్మువరకు బెరుగును. ఇది గుదబద్ధోదరమనంబడును. (7) నాభికి దిగువ నుదరము వృద్ధినంది పోట్లు మంటల గలిగించును. జలస్రావము కలుగును. ఇవి క్షతోదర మనంబడును. (8) నున్నగా పెద్దదిగా నాభికిదిగువ వ్యాపించి నిండా నీరుగలిగి ద్రావకముపోసిన తోలు తిత్తివలె నెగిరిపడి వణకును. గుడగుడమనిశబ్దించును ఇది జలోదరము. గుదస్థానమును బంధించి యుదకముపుట్టియుండినయెడల పదునైదుదినములకన్న నెక్కువగా రోగి బ్రతుకడు. కన్నులు గుంటలుపడి లింగము వంకరగవంగి చిక్కగయుండిన బలరక్తమాంసములు ఆకలి యివి తగ్గినయెడల చికిత్సలేదు.

---

## 4. గుమ్ముడు.

ఇది నేలగుమ్ముడు పాలనేలగుమ్ముడని రెండు విధములు.

నిఘంటువు:—విదారిక- శుక్ల- స్వాదుకంద -సృగాలిక -వృషకంద-

విదారి- వృషవల్లి- క్రోష్టిక- వలీకంద- శ్యామకంద- గజవాజి ప్రియ యివి నేలగుమ్ముడు పేళ్ళు.

క్షీరవిదారి- ఇక్షుగంధ- ఇక్షువల్లి- క్షీరవల్లి- క్షీరగంధ- క్షీరశుక్ల-పయస్విని- మహాశ్వేత- ఋక్షగంధి- ధవళ- పద్మిని- క్షితి యివి పాలనేలగుమ్ముడు పేళ్లు.

### గుణోపయోగములు.

నేలగుమ్ముడు నపుంసకత్వము, క్షయము, వాతము, పిత్తము, రక్తదోషము, కృశత్వమును హరించి వీర్యవృద్ధిని బలమును గలిగించును. పాలనేలగుమ్ముడు మధురముగనుండి జ్వరము, రక్తదోషము, అతిమూత్రము, తాపము, వాతము, పిత్తములను హరించి శరీర వీర్య పుష్టుల గలిగించును.

---

## 5. ములుగోరింట.

నిఘంటువు:—సైరేయకి- సహచర- సైరిక- సహాచర-తిండి-సైర్యక- మృదుపుష్పక- స్వర్ణపుష్ప- కింకరాత- కుమారి- తరిణి- యివి ములుగోరింట పేళ్ళు. ఇది పచ్చనిపూలతోఁగూడిన కురంటక మనంబడును. ఎఱ్ఱనిపూల గలిగినకురువకము. నల్లనిపూలతోఁ గూడియుండిన ఆర్తగళము, దంసి, చాణక్యము, ఓదనపాకి యనంబడును.

### గుణోపయోగములు.

ములుగోరింట శీతలముగను జేదుగ నుండును. వాపు, దప్పి, తాపము, వాతము, రక్తదోషము, కాసము, శ్వాసము, శూల, జ్వరము, త్రిదోషములు వీనిని నివర్తించును. కేశ్య వీర్య బలవృద్ధికరము.

### రోగ లక్షణము.

జ్వరరోగము:—మునుపు జ్వరమును గుఱించి స్థూలముగలక్షణములఁ జెప్పితిమి. యికపై సూక్ష్మవిభాగముల వివరించెదము. (1) శరీరమువణకు-జ్వరమిపుడువచ్చునని తెలియకుండుట-కంఠము పెదవులందుఁ దడిలేకయుండుట-నిద్రపట్టదు-ఎక్కిళ్లుకలుగును. దేహము వేడిగానుండును. తలనొప్పి- ఱొమ్మునొప్పి- దాహ



ముండును. పెంటికలుగ విరోచనమగును. కడుపునొప్పి, కడుపుబ్బరము,ఆవలింతలుండును. యిదివాతజ్వరము. (2) గుండెలు కొట్టుకొనుటను, వేడిమి, అతిసారము, నిద్రకొంచెము, వాతి, గొంతు పెదవులు ముఖము ముక్కు- వీనిని గడుసుండును. చెమటపట్టును. నాలుక బిరుసెక్కును. మూర్ఛ, నోటవదరుట, మంటలు,మదము,దాహము,విరోచనము మూత్రము కన్నులు పచ్చనైయుండును. భ్రమకలుగును. యిది పైత్యజ్వరము. (3) దేహముచల్లనై మాటలడ్డుపడును. నోరు తియ్యనైయుండును. మూత్ర పురీషములు తెల్లనగును దేహము స్వాధీనమునకు రాదు. చలివాంతివచ్చునట్లుండును. వెంట్రుకలు నిక్కపొడుచుకొనును. అతినిద్ర, పీనస, అరుచి, దగ్గు, కనులు తెల్లబడుట యివికలుగును, యిదికఫజ్వరము. (4) నాలుకెండును, మూర్ఛ భ్రమ, మంటలు, నిద్రలేమి,తలపోటు,కంఠముఖముయెండుట, వమనము, గగుర్పాటు, అరుచి, అజ్ఞానము, కీళ్లనొప్పులు,ఆవలింతలు కలుగును. యిది వాతపిత్తజ్వరము, (5) శరీరము చల్లనగును. కీళ్ళనొప్పులు, అతినిద్ర, తలనొప్పి, పీనస,దగ్గు,చెమట పట్టకుండుట, సంతాపము, నాడి వేగముతగ్గుట,యివి యుండిన వాతశ్లేష్మజ్వరము. (6) నోరంతయు శ్లేష్మముతో బూసినటులను,చేదునుగలిగియుండును. నిద్ర-మూర్ఛ-దగ్గు-అసహ్యము, నోరెండును. తాపము మాటిమాటికి గలుగును. చలువలు గ్రమ్మును. యిది పిత్తశ్లేష్మ జ్వరము. (7) కొంతసేపు తాపముండి మఱికొంతసేపటికి శీతలము గ్రమ్మును. దేహమునందలి యెముకలకు నొప్పి కలుగును. తలపోటు- కనుల నీరుగ్రమ్ముట- కలుషములగుట- యెఱ్ఱబడుట- తెఱచుటకు శక్తిలేక లోపలికి మూసుకొనిపోవుట-చెవులశబ్దముపోటుకలిగియుండుట-గొంతున ముండ్లవలె గ్రుచ్చుకొనుట-తందర- మోహము- ప్రలాపము- కాసము-శ్వాసము-అరుచి-భ్రమ-నాలుకనల్లనైములుచూపుట దేహము స్వాధీనముగ లేకుండుట- రక్తపిత్తకఫములఁగ్రక్కుట- తల నిలువకుండుట- దాహము - నిద్రలేమి - హృదయవ్యథ-

చెమట పట్టకుండుట- మలమూత్ర బద్ధకము- దేహముచిక్క కుండుట- గొంతున గుఱక- శ్యామరక్త మండల దర్శనము, మూగగనుండుట-నాడీదహనము-ఉదరగురుత్వము యివియుండునేని సన్నిపాతజ్వరము. (8) చెవులువినవు. నేత్రములుమూసి కొనిపోవును. చేష్టలు లేకుండును. కంటికెదియు గనంబడదు. ముక్కునకు వాసనయు - దేహమునకు స్పర్శయు - చెవులకు ధ్వనియు దెలియవు. శిరస్సు దొర్లును. ఆహారముపై నిష్టముండదు. కంఠమునందు ధ్వనిపుట్టును. దేహమునకు బాధ కలుగును. యిటుల నటున దొర్లును. అల్పభాషయు నుండినయెడల అభిన్యాసజ్వరము (9) చొంగ కారును. కారణములేక సంతోషము. మనశ్శుద్ధిలేకుండును. దేనియందును రుచియుండదు. మదము- మాంద్యము- నోటదడిలేకుండుట- ఆకలిలేకుండుట- బహుమూత్రము- విషువని జ్వరము యివియుండినయెడల ఆమజ్వరము.

---

6. వాకుడు. (యిది నేలములకయందురు.)

నిఘంటువు:—కంటకారి-దుస్పర్శ-క్షుద్ర-వ్యాఘ్రి-నిదిగ్ధిక- కంటారిక-కంటకిని-ధావని-దుష్ప్రధర్షిణి-ప్రచోదని-కులి- క్షుద్ర-బృహతి రాష్ట్రిక యివి వాకుడు పేళ్ళు.

గుణోపయోగములు.

వాకుడు వగరుగ జేదుగ నుష్ణముగ నుండును. శ్వాసము, కాస, అరుచి, జ్వరము, వాతము, ఆమదోషము, హృద్రోగములను హరించును.

---

7. విషబొద్ది. (అగరుశొంఠి.)

నిఘంటువు:—పాఠ-అంబష్ట-అంబష్టక-ప్రాచీన- పాపచేలిక-వరతిక్త-బృహత్తిక్త-పాఠిక- స్థాపని- వృకి- మాలవిత్- త్రిసర- దేవి-త్రివృత్- సతి- వర- దీపని- వల్లిక- యూష- వృత్తపర్ణి యివి విషబొద్ది పేళ్లు.



గుణోపయోగములు.

విషబొద్ది వగరుగ జేదుగ నుష్ణముగనుండును. యిది వాతము, పిత్తము, కఫము, జ్వరము, శ్లేష్మము, అతిసారము, విషము, కుష్టము, దురద, వాంతి, హృద్రోగము, త్రిదోషముల హరించి విఱిగిన యెముకల నొకటి చేయును. ధాతువృద్ధి గలిగించును.

రోగ లక్షణము.

కుష్ఠరోగము:—ఈ రోగలక్షణమును బూర్వము స్థూలముగా జెప్పితిమి. యిపుడు సూక్ష్మాంశముల నెఱింగించెదము. (1) నల్లగ నెఱ్ఱగనుండి కపాలాకృతిగలిగి సూక్ష్మమగు మంటలం గలిగి, పురుషస్పర్శగలది కాపాలము. దీనియందు నొప్పి యధికము. విషమగుటచే చికిత్స సాధ్యముకాదు. (2) నొప్పి, తాపము, ఎఱుపు దురదయుండి రోమములుండి మేడిపండువంటి యాకారముగలది యౌదుంబరము. (3) తెల్లగ నెఱ్ఱగనుండి స్థిరమై తడిసినట్లుండి నునుపుగలిగి మండలముగనుండక యొకటితో నొకటి మచ్చలుపడి కలిసియుండునది మండలము. (4) కఠిన స్పర్శయు, నోరలయం దెఱుపును, లోపల శ్యామమును గలిగి వేదనతోగూడి జింక నాలుకవంటిది ఋష్యజిహ్వము. (5) తెలుపు, ఎఱుపు కలిసినవర్ణముగలదై చేతితో రుద్దిన దుమ్మువలె రాలునది శ్వేతము. దీనికి బొల్లియనియుఁ బేరు. (6) అొమ్మున ననపచెట్టు పువ్వువంటి యాకారముగలది సిధ్మము. (7) గురిగింజవలె నడుమ నలుపును జుట్టు నెఱ్ఱగ నుండునది సన్నిపాతజము. ఇది కాకణ మనంబడును. ఈయేడును మహాకుష్టములు. ఇక పైక్షుద్రకుష్ఠముల నెఱింగించెదను. (1) చెమట లేక చేపవలె నుండునది చర్మము. అధికమయినయెడల హస్తిచర్మము (2) ధూమ్రవర్ణమై కాయకాచినట్లుండి కఠిన స్పర్శ గలది కటికుష్టము. (3) కాళ్ళు సేతులు బద్ధమైతీవ్రవేదనంగలది వైపాదికము. (4) దురదగలిగి యెఱ్ఱనిరంగుగల బొబ్బలుపొక్కినట్లుండి వ్యాపించియుండిన అలసకము. (5) దురద గలిగి యెఱ్ఱనిరంగుతో గడ్డములవలెనుండి పైకి బయలు దేరి పెరుగు

వది దద్రుమండలము. (6) ఎఱ్ఱగనుండి పోటుగలిగి బొబ్బలు పుట్టి దురదగలిగియుండునది చర్మదళము. (7) చిన్నపొక్కులనేకములుగలిగి రసిగారుచు దురదగలిగి మంటలు మండునది పామ. (8) యిట్టి పొక్కులే తీవ్రతాపమునుగలిగించి చేతులు తొడలయందుండిన కచ్చు. (9) బూడిదవర్ణముగ నెఱ్ఱని కాంతితోఁగూడి చిన్నపొక్కులు కనబడిన విస్ఫోటము. (10) ఎఱ్ఱగ బూడిద వర్ణముగలిగి మంటతోనుండి పైకి వ్రణమై యుండునది శీతారుకుష్ఠము. (11) దురదతోఁగూడి ధూమ్రవర్ణమై బహుస్రావముగల పిడకము విచర్చిక.

---

## 8. అరటి.

ఇది అరటి, అడవి అరటి, కొండ అరటి, బంగారపరటి, నల్లరటి, బొంతరటి అని యాఱువిధములు.

నిఘంటువు:—కదళి- సుకుమార-రంభ- భానుఫల-కాశ్మీర-నిస్సార-మోచ- హస్తివిషాణిక- ఎకాష్ఠీల- వారణాంబు- వృత్తపుష్ప మహాఫల యివి అరటిపేళ్లు.

కాష్ఠకదళి-మకాష్ఠ-వనకదళి- కాష్ఠల- ధరారంభ- దారుకదళి-ఫలాఢ్య-వనమోచ-శుక్రవర్ధని అడవి అరటిపేళ్ళు.

శ్రీకదళి-గురురంభ-పర్వతమోచ-పుణ్యాకదళి-బహుప్రజ-వనరంభ-గిరిజా-గజవల్లభా యివి కొండ అరటిపేళ్ళు.

సువర్ణకదళి-సువర్ణరంభ-కనకరంభ బంగారపరటి పేళ్ళు.

కృష్ణరంభ యివి నల్లరటిపేళ్ళు.

పిశాచకదళి యివి బొంతరటి పేళ్లు.

### గుణోపయోగములు.

అరటి యోనిదోషమును, అశ్మరీరోగమును, రక్తపిత్తమును హరించును. శీతలముగ నుండును. అరటిగడ్డ చలువచేయును. బలము నిచ్చును. వెంట్రుకలకు హితకారి. కఫపిత్త కుసుమరోగములను బోగొట్టును. అరటిపండు మధురముగ శీతలముగ మలబద్ధకారిగ జిగటగ నుండును. కఫమును గురుత్వమును గలిగించును. పిత్తరక్తము, దప్పి,



తాపము, గాయము, క్షయము, వాతముల హరించును. లేత అరటికాయ శీతలముగ మధురముగ వగరుగ రుచిగ బుల్లగ నుండును. పిత్తమును బోగొట్టును. ముదిరిన అరటికాయ వగరుగ చేదుగ మలబద్ధకారిగ రూక్షముగ శీతలముగ పథ్యకారిగ నుండును. మేహము, పిత్తాతిసారము, అర్శస్సు, పిత్తరక్తము, దప్పి, జ్వరము, కఫము వీనిని నివర్తించి అగ్నిదీపనమును వాతమును గలుగజేయును. అరటిపువ్వులు జిగటగ మధురముగ వగరుగ గురువుగ మలబద్ధకారియైయుండి చేదుగ నుండును. అగ్నిదీపనమును గలిగించును. వాతమును హరించును. వీర్యమునకు కొంత వేడిమిని గలిగించును. రక్తపిత్త క్షయముల హరించును. అరటిబొందె వగరుగ శీతలముగ గురువుగ నుండును. దప్పి, తాపము, పిత్తము వీనినిబోగొట్టి కఫాగ్ని మాంద్యముల హెచ్చించును. అడవిఅరటి రుచిగ శీతలముగ మధురముగ నలుగకుండును. రక్తపిత్తమును బోగొట్టును. అగ్నిమాంద్యమును గలిగించును. కొండ అరటి మధురముగ రుచిగ శైత్యముగ నుండును. బలవీర్యముల వృద్ధి చేయును. దప్పి, పిత్తము, తాపము, శోష వీనిని తగ్గించును. సులభముగ నరుగకుండును. బంగారపరటి మధురముగ శీతలముగ నుండును. అధికాహారమును లోగొనంజేయును. దప్పి, తాపము, కఫము వీనిని బోగొట్టును. అగ్నిదీపనము, శుక్రవృద్ధి వీనిని గలిగించును. నల్లరటి పండ్లు రుచిగ శీతలముగ మంచి వాసనకలదియై యుండును. దోషములను భేదించును. హృదయమునకు మేలుచేయును. మేహతాపము పిత్తరక్తములను హరించును. బొంతరటిపండ్లు రుచిగా నుండును. పిత్తము, రక్తపిత్తము, ప్రమేహము, రక్తదోషము, ప్రదరరోగము వీనినిహరించి శుక్రవృద్ధిం జేయును అరటినీళ్ళు శీతలమును మలబద్ధకారిగ చేదుగనుండును. దప్పి, తాపము, మూత్రకృచ్ఛ్రము, అతిసారము, మేహరోగములు, స్ఫోటకములు, రక్తపిత్తము, అస్థిస్రావము, సోమరోగములను నశింపంజేయును.

### రోగ లక్షణము.

సోమరోగము:—ఇది స్త్రీలకు సంభవించెడి అతిమూత్రరోగము, అతిమైథునము, అధిక దుఃఖము, అధిక శ్రమ వీనిచేతను,అదిసారము

పుట్టించు. మందును తినుటచేతను, విషవస్తువులనుదినుటచేతను, దేహమంతటనుండెడి జలభాగములన్నియు నుష్ణంగి ప్రవహించును. అన్నిచోట్లనుండిన జలము మూత్రకోశమున జేరును. అవి నిర్మలముగ ప్రసన్నముగ చల్లగ వాసనయు నొప్పియు లేక యధికముగా వచ్చును. దానిచే స్త్రీలు దుర్బల దేహముగల వారలగుదురు. అట్టివారికి సుఖము లేశమైననుండదు. తల నొప్పిరొత్తును. ముఖము దవడ లెండిపోవును. ఇది పెరుగగను పెరుగను మూర్ఛ, ఆవలింతలు, ప్రలాపము గలుగును. ఎంత తినిన నెంత త్రావిన దనివి తీరదు.

అశ్మరీరోగము:—అశ్మరియన మూత్రమున సుద్దకట్టు, ఇసుక, రాళ్ళు పడుట ఇది శ్లేష్మప్రధానమైనది. చికిత్స చేయకుండిన యెడల మరణమును గలిగించును. ఇది నాలుగు విధములు. వాత, పిత్త, శ్లేష్మ, శుక్రంబులని. అశ్మరిపొత్తికడుపునందుజేరి శుక్ర మూత్రములను, వాతపిత్త శ్లేష్మములలో నొకటిని దగ్గించును. ఇది గోరోజనవర్ణముగలది. ఇది వచ్చుటకుముందు పొత్తికడుపుబ్బును. దానిచుట్టుప్రక్కలనంతటను మిగుల నొప్పిరొత్తును. మేకమూత్రమువంటి వాసన మూత్రమున కుండును. అంతమీదటి మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అరుచికలుగును. పొత్తి కడుపునకు మీదిభాగము బొడ్డుకుదిగువనొప్పికలిగి మూత్రము ధారగారాక తునియలగును. అపుడశ్మరి యడ్డము నిలుచును. అది వెలికివచ్చినయెడల సుఖముగ మూత్రము వచ్చును. అది గోమేదికవర్ణమైయుండును. అశ్మరి మాటిమాటి కడ్డపడుటచే బుండై రక్తసహితంబుగ వచ్చును. దానిచే బాధనొందును. పండ్లుగొరుకుకొని వణకును. అబ్బ అమ్మాయనుచు బొడ్డును లింగమును బాధతగ్గుటకై పట్టుకొనును. మలము కల్మష యుతమైవచ్చును. అపుడప్పుడు చుక్కలు చుక్కలు మూత్రము బూడిదవర్ణముగ నెట్టిగ నుండును. ఈయశ్మరి ముల్లుగ్రుచ్చుకొన్నట్లుగా మంటలు గలిగియుండును. ఇది వాతాశ్మరి. నల్ల జీడిగింజలోనివలుకువలె నెట్టిగనై పచ్చగనైన తెల్లగనై ననుండు



నశ్మరివడి పొత్తికడుపు మంటలను ఉడుకుచున్నట్లు వేడిమిగ జేయును. ఇది పిత్తాశ్మరి. చల్లగ బరువుగ నధిక మృదువుగ తేనెవర్ణముగ సూదులతో గ్రుచ్చుచున్నట్లుగనుండు నశ్మరి శ్లేష్మాశ్మరి. ఇది బాలురకు తరుచుగా గలుగును. పడునా తెండ్లమీద శుక్రాశ్మరివచ్చును. దీనిచేదుర్బలత్వము, నొప్పులు, చిక్కుట, కడుపునొప్పి, అరుచి, పాండువు, ఉష్ణవాతము, దాహము, వాంతి యగును,

---

# గోరక్షుడు.

ఇతడు చెప్పిన 1-గగ్గెర, 2-ఉమ్మెత్త, 3-గన్నేరు, 4-మునగ, 5-ముల్లంగి, 6-కాచి, 7-తులసి, 8-చల్లగడ్డ వీనికి శాపనివర్తి.

శుభదిన శుభలగ్నమున వీనిచెంతకేగి "ఓం నమోభగవతే ప్రశాం శౌం రుద్రాకార సకలసిద్ధిప్రదాయ వృషభరాజాయనమ స్వాహా" యను మంత్రమును ముప్పదియూరుమారులు జపించి కదళీఫల నైవేద్యముంచునది దీనికి యంత్రములేదు.

## 1. గగ్గెర.

ఇది గగ్గెర, అడవిగగ్గెర, నల్లగగ్గెర యని మూడువిధములు.

నిఘంటువు:—కుఠేరక-వైకుంఠ-క్షుద్రపర్ణ-అర్జక యివి గగ్గెరపేళ్ళు. అర్జక - సుముఖ- సప్రశస్త- గరమ్నిక- కపిత్తార్జక- వట పత్ర-కటింజర యివి అడవిగగ్గెర పేళ్ళు.

కుఠేరక- మాలుక- కృష్ణమాలుక- కృష్ణార్జక-కాలమాల- కరాళ-కృష్ణమల్లిక యివి నల్లగగ్గెర పేళ్లు.

### గుణోపయోగములు.

మూడు గగ్గెరలు చేదుగ నుండును. శ్వాసము, దుర్గంధము, కఫము, వాతము, విషము, దురద, తలనొప్పి, పార్శ్వశూల వీనిని బోగొట్టును.

### రోగ లక్షణము.

విషము:—నిద్ర, స్మృతితప్పుట, ఆయాసము, దాహము, దేహమున చలువలుగ్రమ్ముట, గగుర్పాటు, లోపల జీర్ణింపకున్నపుడు శరీ

రమున కుబ్బును, అతిసారమును గలిగించును. ఇవి జంగమ విషగుణము, జ్వరము, ఎక్కిళ్ళు, దంతఘర్షణము, స్వరము రాకుండుట, నురుగుగ్రక్కుట, అరుచి, శ్వాసము, మూర్ఛ యివియుండిన స్థావరవిషము. భూమిపైబొర్లాడుచును, ప్రలా పించును, మతిభ్రమ కలుగును. ఇదియుండిన గురిగింజ, నీలి, గన్నేరు ఈ నీళ్ళలోనొకటితినెనని తెలియుచున్నది. ఆవలింత, శ్వాసము, వణకు కలిగిన యెడల పెద్దచిన్నపిప్పలి, దేవదారు, విషపత్రిక, చేదుసార వీనియాకులనుదినెననియు, వృషణముల వాపు, దాహము, అన్నద్వేషముండినయెడల పెద్దపిప్పలి, వన పిప్పలి, పెద్దబీర, ఈకు, దేవతాళము, రేణుక, మెరుపుతీగె, చెప్పుతట్ట, సర్పాక్షి, సోవు, బండిగురిగింజ, తుంబురు వీనికాయ లను తినెననియు, వాతులు, పొట్టయుబ్బరము, శ్వాసము కలి గినయెడల పెద్దచిన్నపిప్పలి, నల్లనేలగుమ్ముడు, కడపవేపుచెట్టు వీనిపువ్వుల లోగొనెననియు దెలియునది. జిల్లేడు, దుష్టపు జముడు వీనిపాలను విషముగలదు. దీని లోంగొనినయెడల నురుగుగ్రక్కును. విరేచనములు, కడుపుభారమగుట, బొమ్మల నొప్పియుండును. వనపిప్పలి, నూగుదోస, చిత్రమూలము, తామరదుంప, దురదగొండి, బండిగురిగింజ, గుమ్మగుత్తి వీని బెరడును బంకను పుచ్చుకొన్నవారికి నోరుకంపు, తలనొప్పి, కఫముగ్రక్కుట, నాలుక బిరుసు యివియుండును. అడవికంద, అతివస, ఆవాలు, కర్కాటకశృంగి, కలబంద, గరళము, తుంగ ముస్తెలు, నీటిచేమ, ప్రపౌండరీకం, పీన్నదూలగోవెల, పోస్తు ముల్లంగి, వసనాభి వీనిదుంపలందు విషముగలదు. వ్రేళ్లకువలె లక్షణములు దీని కెరుగవలయు చిట్టపురాతిభస్మం, హరిదళము వీనిచే మూర్ఛ దవడల మంటలు గలుగును. ఇపుడు చెప్పిన వన్నియు స్థావరవిషములు. ఇవి యప్పుడే చంపక కాలక్రమ మున జంపును. గాయము తగిలినదే రక్త యుష్ణముగ స్రవిం చుట, ఎంత స్రవించినను నిలువక తాపమును గలిగించుట, నెత్తురునల్లబడి స్రవించి దుర్గంధమునుగలిగి మాంసఖండములు



వెలివచ్చుట, దప్పి, జ్వరము, మూర్ఛ, తాపము యివియుండిన విషాయుధముతో గొట్టబడెనని యెఱుంగునది. మునుపే వ్రణ ముండి యందు విషమునుబ్రవేశింపజేసినను నిట్టిచిహ్నాలే కలు గును. పచ్చగ కరుధూపవర్ణముగ విరేచనములగువారికి నురు గులు గ్రక్కుకొనువారికి విషపస్తుపానము చేసినని యెఱుంగు నది. నల్లత్రాచుకొఱికనచోటు నల్లనైయుండి వాతవికారముల గలిగించును. జెఱ్ఱి, గొడ్డు, కొండచిలుక కఱచినచోట పచ్చనై పైత్యవికారముల గలిగించును దేహమువాచును. పొడవగు మూడునిలువు రేఖలుగల పాము ముట్టినయెడల స్థిరమై దేహ మంతయునూది గడ్డలుకట్టి పచ్చని నున్నపైన కాంతి గలిగి మిగుల జిక్కనైన రక్తముగలిగియుండి శ్లేష్మవికారములనుగలి గించును. రాగిచెట్టున, గుడిని, శ్మశానమున, పుట్టలను, రచ్చ వీధులను, చతుష్పథమున (నాలుగుతోవలు కలియు చోటు) మర్మస్థానములందు, పర్వదినముల, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీ నక్షత్రముల పాముకఱచినయెడల నసాధ్యము. అజీర్ణముకలవారికి, పిత్తము గలవారికి, ఎండవడిదాకినవారికి, బిడ్డలకు, ముదుసల్లకు, బలము లేనివారికి, మేహరోగికి, కుష్ఠరోగికి, జ్వరముగలవానికి, గర్భిణి స్త్రీకి, ఆకొన్నవానికి పాము కొఱికినయెడల తిఱుగనేరదు. ఆమాశయమున విషము ప్రవేశించినయెడల కఫవాతములు విశేషమగును. పక్వాశయమున ప్రవేశించిన వాతపైత్యరోగి యగును. జీర్ణకోశమునందు విషము ప్రవేశించినయెడల దేహ మున తలనుండెడి వెంట్రుకలు నలిపిన రాలిపోవును. ఱెక్కలు లేనిపక్షిని బోలియుండును. పెట్టుడుమందుకలవానికి పాండు రోగము, కృశత్వము, ఆకలిమందము, గుల్మము పెరుగుట-మర్మ స్థానములందు నొప్పి- కడుపుబ్బరము- చేతులవాపు- కడుపు పెరుగుట- గ్రహణీ- క్షయము- బల్ల-జ్వరమువచ్చును. సాలె పురుగు కఱచినయెడల కఱచినచోట చెడుగబ్బు కొట్టును. నెత్తురువచ్చును. జ్వరము- తాపము- అతిసారము మొదలగు

రోగములు కలుగును. దేహమునందు పొక్కులు బగ్గీలు పుట్టును. దేహముబ్బును. కాటునపుడు నలుపో కపిలవర్ణమో యుండిబూజుదారములచేనింపబడిపైకివచ్చుచున్నట్లునుండును. ఎలుక కరచినయెడల కోరలు దిగినచోట రక్తము పారుచుండును. తేలు కఱచిన తోడనే నిప్పువలెమండి పైకెక్కి బాధించును. పిదప దిగి కుట్టినచోట నుండును. ఱొమ్మున ముక్కున నాలుకను కుట్టినయెడల మాంసమును గ్రక్కి మరణింతురు.

---

## 2. ఉమ్మెత్త.

ఇది ఉమ్మెత్త నల్లఉమ్మెత్తయని రెండు విధములు.

నిఘంటువు:—ధుత్తూరక- ధూర్త- దేవత- కిదవ-శఠ-ఉన్మత్తక-మదనక- కస్తూరికలహ- సువర్ణ- తపనియ్య- తూణి- హాలహల- సుఃక్ష్ణనామ- మాతుల- పూతివల్లభ యివి ఉమ్మెత్త పేళ్ళు.

త్రిపుష్పి-మోహిని- మాని- కాంచని- కృష్ణపుష్పిక-కితవ ఉన్మత్తక-కృష్ణ-రండ-పుష్పి-హారిణి యివి నల్లఉమ్మెత్త పేళ్లు.

### గుణోపయోగములు.

ఉమ్మెత్త కారముగ చేదుగ నుష్ణముగనుండును. యిది కుష్టువు దురద- వ్రణము- అరికాలిబొబ్బలు- విషము వీనిని హరించును. లేపనముచే వాయువును జయించును.

నల్లఉమ్మెత్త కుష్టువు-వాతము- మోహము-కఫము- శ్వాసము- విషము వీనినిహరించి గర్భవాతము- మోహము-బలమునుగలిగించును.

### రోగలక్షణము.

వాతరక్తదోషము:—యిది వాత లోనొకభాగమైనను యిది పుట్టుటయు చికిత్స చేయుటయు భేదమైయుండుటచేత వేఱుగ జెప్పెదము. ఉప్పు-పులుసు- వగరు- చేదు- చమురుతోగూడిన వేడియన్నము. దీనిలో నేదియైన నొకటిని అజీర్ణ ముండునపుడు భుజించుటచేతను- పచ్చి లేక యెండుచేపలు- గానుగపిండి (తెలగపిండి) ముల్లంగిదుంపలు- ఉలవలు- అనుములు- మినుములు మొదలగు పప్పులు- కూరగాయలు-మాంసము- చెరకు



రసము, పెరుగు, కలి, రేగుపండ్లు, పేలపిండి, మజ్జిగ, కల్లు, సారాయి, తన కపథ్యమగు వస్తువులు భుజించుటచేతను, అతికోపముకలుగుట, పగటినిద్ర, రాత్రిమెలకువ, వేళతప్పితినుట, అధికముగతిరుగుట వీనిచేకలుగును. ఇందు వాతముదుష్టము: రక్తము నిర్దోషము. ఇది వచ్చుటకు మునుపు అధికముగాఁ జెమటపట్టినను బట్టును. చెమటపట్టడమేకష్టముగనైననుండును. దేహమునల్లపడును. స్పర్శజ్ఞానముండదు. కొంచెము గాయము తగిలిన విశేష బాధయై సాధారణము మదురదు. కీళ్ళు శిథిలములై స్వాధీనము కాకయుండును. మాంద్యము నొప్పులు, పొక్కులు కలుగును. దేహమునందు మచ్చలు పుట్టును. ఇది మొదట కాళ్ళకైనను చేతులకైనను ఆరంభించి దేహమంతట వ్యాపించును.

---

## 3. గన్నేరు.

ఇది తెల్లగన్నేరు ఎఱ్ఱగన్నేరని రెండు విధములు.

నిఘంటువు:—కరవీర-అశ్వహ-అశ్వఘ్న-హయవార-అశ్వమారక-శతకుభ- శ్వేతపుష్ప- ప్రతిహాస- అస్వఘాతక- మీనకాఖ్య-హయారి-సబీజ-కుసుమోద్భవ యివి తెల్లగన్నేరు పేళ్లు.

చండక- లగుడ- చండాతక- గుల్మగుల్మ-ప్రచండ-కరవీరక యివి ఎఱ్ఱగన్నేరు పేళ్లు.

### గుణోపయోగములు.

గన్నేరులు రెండును కారముగఁ జేదుగ నుష్ణవీర్యముగలదిగ నుండును. ఇది దురద, కుష్టువు, చర్మరోగము వీనిని నివర్తించి నేత్రములకు హితకారియై యుండును.

### రోగ చికిత్సా విశేషములు.

కుష్ఠురోగము:—పెన్నేరుగడ్డ, వాయువిళంగము, చిత్రమూలము, జీడిగింజలు, నేలదంతివేరు, రేలపట్ట, వేపవిత్తులు వీనిని సమభాగములుగ దలచి కలితోనూరి లేపనముచేసినయెడల శ్వేతకుష్ఠువు నశించును. తెల్లగురిగింజలు, కోష్ఠు, వస, వేపవిత్తులు

